అక్టోబరు 1995

సంపుటి : 11

సంచిక : 10



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం - 521 001

ఫోన్ : 22818



విడి ప్రతి : రు. 4-50

సంవత్సర చందా : రు. 54-00

4 సం॥ల చందా : రు. 200-00

జీవిత సభ్యత్వం : రు. 600-00

పోషకులు : రు.1,116/-

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM
Phone : 21137

Despatched on 7-10-1995



# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు


## విషయసూచిక



## మనవి

పాత చందాదారులు 'రెన్యూవల్' చేయండి ! మరో క్రొత్త చందాదారుని చేర్పించండి ! భగవాన్ బాబావారి 70వ జన్మదిన ప్రత్యేక సంచిక (నవంబర్ '95) తో పాటు శ్రీ సత్యసాయి శతకము (తృతీయ భాగం) ను ఉచితంగా పొందండి !

ముఖచిత్రం : జగన్మాత

# జగన్మాత

-కొమరగిరి జయప్రద

పుం రూపం వాస్మరేద్దేవీం
స్త్రీ రూపం వా విచన్తయేత్
అథవా నిష్కలం ధ్యాయే
త్సచ్చిదానంద లక్షణామ్ ॥

దేవీ ధ్యానం స్త్రీ రూపంలో కాని పురుష రూపంలో కాని నిష్కలమైన సచ్చిదానందరూపంలో కాని చేయ వచ్చు అని శాస్త్రం. ఆసేతు హిమాచలం ఆనందంగా జరుపుకునే పండుగ విజయ దశమి. అదే దసరా, దేవీ నవరాత్రులు, శరన్నవరాత్రులు అని కూడా అంటారు. త్రిమూర్తులను కూడా కేవలం నిమిత్తమాత్రులుగా చేసిన సర్వ శక్తి స్వరూపిణి ఆ లలితా పరమేశ్వరి. ఆమె శక్తిస్వరూపములు అనంతములు. అందులో కొన్నింటిని నవరాత్రుల సందర్భములో పూజించి తరిస్తారు. మధుకైటభులను సంహరించిన 'మహాకాళి' ఆమె సకల దేవతల శక్తిస్వరూపిణియై సింహవాహనారూఢియై లోక కంటకుడైన మహిషాసురుని సంహరించి 'మహిషాసుర మర్ధిని' అయినది. శుంభ నిశుంభులు చండముండులను చంపిన 'చాముండి' ఆమె. విప్రచిత్తుడు మొదలయిన రాక్షసులను వధించి 'రక్తదంతి' అయినది పూర్వం మహా కరువు వచ్చినప్పుడు కాయలు ఆకులలములు ప్రజలకు ఇచ్చి,రక్షించి 'శాకంభరి' అనే పేరుతో ప్రసిద్ధి పొందింది. దుర్గముడనే రక్కసుని వధించి 'దుర్గాదేవి' అయినది. మతంగ మహాముని కుమార్తెగా జన్మించి పెక్కు రక్కసుల్ని మట్టుపెట్టి 'మాతంగి' అయినది. భయంకరుడైన అరుణాసురుణ్ణి భ్రమర రూపంలో (తుమ్మెద) వధించి 'భ్రామరి' గా పేరుపొందింది. ఈ తొమ్మిది అవతారాలే కాక అష్టాదశ శక్తిపీఠాల్లోనూ ఆమె నిత్యమూ అర్చించబడుతుంది. సృష్టి కార్యమును జరిపించే బ్రహ్మ దేవుని వాక్కునందు వాగ్దేవిగా శక్తి నిస్తుంది. సకల జీవులను సంరక్షించే శ్రీ మహావిష్ణువు యొక్క వక్షస్థలమున శ్రీమహాలక్ష్మియై వెలసి జనులకు తుష్టిని పుష్టిని ఇస్తుంది ఆమె. లయకారకుడైన ఆ మహా దేవుని శరీరంలో సగభాగమై అర్ధనారీశ్వరత్వాన్ని ప్రకటించింది. శక్తిలేనిదే ఎవరూ ఏ పనీ చేయలేరు. ఆమె మహా మాయ. ఆమె యొక్క లీలావినోదమే ఈ జగన్నాటకం. అందులో మనం పావులలాంటి వారము మానవజన్మ ఇచ్చినందుకు ఆ తల్లికి మనం సర్వదా కృతజ్ఞులమై ఉండాలి ఎక్కడ నుండి వచ్చామో మరల అక్కడికి చేరే ప్రయత్నం చేయాలి ఆ లక్ష్యము ఉన్నతమై ఉండాలి. అందుకోసం మనలోని దుర్గుణాలను దూరం చేసుకొని, సద్గుణములను పెంపొం దించుకొని నిర్గుణ పరబ్రహ్మస్వరూపిణి అయిన ఆ కనకదుర్గను సేవించి తరించాలి అదే ఈ దేవీ నవ రాత్రులయొక్క అంతరార్ధము. ఆమె జగన్మాత, జగజ్జనని, సృష్టి స్థితి లయకారిణి. సృష్టిలోని ప్రతి అణువున దాగి ఉన్న ఆ పరదేవతను ఎవరి శక్తికొలది వారు పూజిస్తారు బాలపూజలు, కన్యపూజలు, సువాసినీ పూజలు, ఆయుధపూజలు వృక్షములకు పూజలు జరుగు తాయి ఈ తొమ్మిదిరోజులు, అన్నీ పవిత్రదినములే. కొన్ని ప్రాంతాలవారు బొమ్మల కొలువులు కూడా పెడతారు ఈ విధంగా బంధుమిత్రులతో కుటుంబ సభ్యులతో సంతోషంగా గడపటానికి మన పూర్వులు పండుగలు పర్వ దినాల పేరున మనకు ఒక సత్ సంప్రదాయములను ఏర్పరిచారు. వాటిని మనం అర్థం చేసుకొని ఆచరించి ఆనందిద్దాం.

"చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ
హస్తే నమస్తే జగదేక మాతః"



# ప్రపంచమంతా చేసుకొనే దివ్య దీపావళి

— కొవ్వూరి సాయిరామ్

మన దేశంలో దీపావళి పండుగకు అన్ని పండుగలలోనూ ఒక ప్రత్యేకత ఉంది ఈ పండుగను మన భారత దేశంలోనేకాక విదేశాల్లోనూ అత్యంత ఆనందంగా, వైభవంగా జరుపుకొంటుంటారు. ముఖ్యంగా విదేశీయులందరిలోనూ జపానీయులు ఈ పండుగను ఎంతో వైభవంగా జరుపుకొంటారు. ఈ పండుగను అక్కడ 'తోరోనాగోషి' అని పిలుస్తారు. ఈ సందర్భములో జపనీయులు ప్రతి ఇల్లూ దీపాల వరసలతో అలంకరిస్తారు. ఆ దేశంలో ఈ పండక్కి మూడు, నాలుగు శతాబ్దాల చరిత్ర వుంది. ఈ రోజున పితృదేవతలు వచ్చి విందు ఆరగించి ఆశీర్వదించి వెళ్లతారని జపాన్‌వారి విశ్వాసం మూడు రోజులపాటు జరిగే ఈ శుభ వేడుకల్లో భాగంగా రెండవ రోజున చాలామంది బంధువులను, మిత్రులను దర్శిస్తారు మూడవరోజున పడవలమీద విహారంచేసి ఆనందోత్సాహాలుగా జరుపుకొంటారు.

చైనాలో "నాయిమ్‌హోబా" అనే పేరుతో ఈ దీపాల పండుగను జరుపుకొంటారు. ఆ రోజున చైనీయులు తమ ఇళ్ళను శుభ్రపరచి రంగు కాగితాలతో, వివిధ అలంకారాలతో తీర్చిదిద్దుకుంటారు. ఇంటి గుమ్మాలకు ఒకవైపు 'సంక్షేమం' అని, మరోవైపు 'లాభం' అని వ్రాస్తారు. ఇకపోతే బర్మా దేశస్థులు గౌతమబుద్ధుడు అవతరించిన రోజును దీపాల పండుగగా కడు రమ్యంగా జరుపుకొంటారు ఈ పండుగను వారు 'తంగీజు' అని పిలుస్తారు ఈ పండుగను వారు ప్రతి ఇల్లు పచ్చతోరణాలతో కళకళలాడే విధంగా, దీపాల కాంతులతో కనువిందు చేసేవిధంగా తయారుచేస్తారు. వారు పెట్టిన దీపాల కాంతులు చాలా వైభవంగా ఉంటాయి. అలాగే ఎంతో వైభవంగానూ జరుపుతారు. అలాగే ఇంగ్లాండ్‌లో 'గైఫాల్స్ డే' అనే పేరుతో నవంబరు నెలలో ప్రతి సంవత్సరం ఈ దీపావళి పండుగను జరుపుకొంటారు. ఈ పండుగనాడు చాలా రకాల బాణాసంచా, సంబరాల్లో ప్రజలంతా పాల్గొంటారు.

మరి ఇక యూదులు మెకాబిన్స్ జ్ఞాపకచిహ్నంగా ఈ దీపాల పండుగను ఎనిమిది రోజులు జరుపుకుంటారు 'మెకాబిన్స్' అనే నాయకుడు 21వ శతాబ్దాల పోరాటాన్ని జరిపి ఇజ్రేల్ వారికి విముక్తిని సంపాదించి పెట్టాడు. వారి సంతోష సంరంభానికి ప్రతీకగా 'హనుక్కా' అనే ఈ పండుగ జరుపబడుతూ వస్తున్నది. ఆ రోజున దివిటీలతో, కొవ్వొత్తి దీపాలతో దేశమంతా దేదీప్యమానంగా అలంకరిస్తారు. ఈ పండుగ సందర్భంగా 'మెకాబిన్స్' జన్మస్థానమైన మోడెన్ నుంచి దివిటీని పట్టుకొని పరుగు పందెపుదారులు 'జెరూసలేమ్'కు తీసుకొచ్చి, దానిని ఇజ్రాయిల్ అధ్యక్షునికి యిస్తారు. ఈ పండుగకు అక్కడ ప్రత్యేక చిహ్నం ఏనుగు. రాజధాని నగరమైన 'టెల్ అవీవ్' లోని భవనాల్ని రకరకాల రంగు దీపాలతో అత్యద్భుతంగా అలంకరిస్తారు. ఇంకా మలేషియా, సుమిత్ర, జావా, ఇండోనేషియా శ్రీలంక వంటి పలుచోట్ల 'దీపోత్సవాలు' అత్యంత దేదీప్యమానంగా జరుపబడుతున్నాయి. ముస్లిం దేశాల్లో "షబేబారాత్" పేరుతో జరిగే పండుగ కూడా దీపాల పండుగే, అంటే ఆశ్చర్యంగా లేదూ ?

మరి ఈ విధంగా ప్రపంచవ్యాప్తంగా 'దీపావళి' పండుగను చేసుకోవడం నిజంగా అందరిలోనూ దివ్యత్వాన్ని చాటుకోవడమౌతుంది.

'సర్వేజనా సుఖినో భవంతు'

శ్లో॥ పఠంతు శాస్త్రాణి, యజంతు దేవాన్
కుర్వంతు కర్మాణి, భజంతు దేవతాః
ఆత్మైక్యబోధేన వినా విముక్తిః
నసిధ్యతి బ్రహ్మ ఉప ॥

# అమృతవాణి

## కాచిభొట్ల చంద్రశేఖరశర్మ

అనేక విషయాలు తెలుసుకొని పండితులనిపించుకోవటానికి మనుష్యులు శాస్త్రాలు చదువుతారు. శాస్త్రాలు బాగా అధ్యయనంచేసి సంఘంలో గొప్ప గౌరవం సంపాదించవచ్చు సన్మానాలందుకోనూవచ్చు ఆచార్య పదవినలంకరించి యెన్నో హితబోధలు చేయవచ్చు పేరు,ప్రతిష్ఠ,సంపద అన్నీ సంపాదించుకొని లౌకికంగా రకరకాల సుఖాలనుభవింపవచ్చు. అందుకే శాస్త్రాదులు చదువుతారు అలాంటి మేధావులు

అలాగే కొంతమంది వారివారి యిష్టదైవాలనుపాసిస్తారు. యజ్ఞయాగాదులు చేసి దేవతలను తృప్తిపరుస్తారు. దేవరుణం తీర్చుకుంటారు. 'పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ' అని దేవ మర్త్య లోకాలకు పరస్పర సహకారముంది మనుష్యులు యజ్ఞాదులు చేసి దేవతలకు హవిస్సును యివ్వాలి హవిస్సందుకొని దేవతలు సకాలంలో వర్షాలు కురిపించాలి దానివల్ల భూలోకం సస్యశ్యామలం కావాలి ఇది మానవులకూ దేవతలకూ వున్న పరస్పర సహకృతి.

ఇక కర్మలనేకం వున్నాయి ప్రతివాడూ కర్మ చేయాల్సిందే తినటం తిరగటం కూడా కర్మలే. వంట చేయటమూ కర్మే. ఇలా నిత్యమూ కర్మలు చేస్తూనే వుంటాడు మనిషి ఇవి చేయకపోతే మనిషి బ్రతుకలేడు. కర్మలు వేరే వున్నాయి అవి నిత్యములనీ నైమిత్తికములనీ ఇవే వైదిక కర్మలంటే. 'త్రైగుణ్య విషయావేదాః' అని గుణత్రయాత్మకమైన వేదం చెప్పిన కర్మలు ఆచరిసుతారు ఇవి కోర్కెలు తీర్చుకోవటానికి చేసే కర్మలు. అతిథి అభ్యాగతుల పూజ సంధ్యావందన వైశ్వదేవ పితృతర్పణాదులు ఇలాంటి కర్మలే ఇవి నిత్యాలు. ఇవి కాక అబ్దికాదులు పితృకర్మలు కొన్ని వుంటాయి అలాంటివి నైమిత్తికాలు. ఇలాంటి నిత్యనైమిత్తిక కర్మలు చేసే కర్మిష్ఠులు కూడా యెందరో వుంటారు.

కాని ఈ శాస్త్రాధ్యయనంగానీ ఈ పూజాపురస్కారాలు గానీ ఈ కర్మానుష్ఠానాలుగాని యివన్నీ ప్రేయస్సు క్రిందకే వస్తాయి. వీటివల్ల కోరికలు తీరవచ్చు సుఖం కలగవచ్చు పుణ్యం సంపాదించవచ్చు.

కాని యీ ప్రేయస్సాధనాలవల్ల ముక్తిమాత్రంరానే రాదు. కేవలం ఆత్మైక్య జ్ఞానంవల్లనే ముక్తి కలుగుతుంది. అంతేతనను తాను తెల్సుకోనంతవరకు ఎన్ని బ్రహ్మకల్పాలు గడిచినా ముక్తి సంభవించదు. అమృతత్వసిద్ధి కలగదన్నమాట చావు పుట్టుకల సంసారం వదిలి మరల తిరిగిరాని గతి కలగటమే మోక్షమంటే—

ఈ కర్మాదులవల్లగాని ధనాదులవల్లగాని లభ్యమయ్యేది కాదు ముక్తి. జ్ఞానం వల్లనే ముక్తి కల్గుతుంది. 'జ్ఞానాదేవతు కైవల్యం'.



# బుద్ధి విజ్ఞానములకు పతి
# సర్వ గణములకు అధిపతి – గణపతి

——————————————— భగవాన్ సాయి దివ్యసందేశం

"తొండము నేక దంతమును తోరపుబొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపుల మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
ఉండెడు పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మ్రొక్కెదన్"

ప్రేమస్వరూపులారా !

భారతీయుల పర్వదినములు ఆధ్యాత్మిక అంతరార్థముతో కూడినటువంటి పరమార్థములు. కాని ఈనాటి భారతీయుడు బాహ్యమైన, లౌకికమైన ఆచారములకే ప్రాధాన్యతనిచ్చి; నిత్యమైన, సత్యమైన అంతరార్థ యుక్తమైన ఆధ్యాత్మిక తత్త్వాన్ని విస్మరిస్తున్నాడు 'పార్వతీతనయ ఓయి గణాధిప!' అని వేదము వర్ణించింది ఎవరు ఈ పార్వతి ? ఈమె కుమారుడు ఎవరు ? తల్లి కుమారుల సంబంధ బాంధవ్యమేమిటి ? లోతుకు పోయి అంతరార్థమును విచారించాలి 'గణాధిప!' ఏ గణములు ? సురగణములా ? అసురగణములా ? సురగణములు. ఈ గుణములు ఎక్కడ ఉంటున్నాయి ? బాహ్య ప్రపంచంలో సంచరించుచున్నాయా ? లేక అంతర్ముఖమై మానవుని దేహమునందే యిమిడి ఉన్నాయా ? సురగణములకు పతి గనుకనే – ఇతనిని 'గణాధిపతి' అన్నారు కర్మేంద్రియ, జ్ఞానేంద్రియముల యొక్క తత్త్వమే గణముల యొక్క స్వరూపం. ఈ దశేంద్రియముల యొక్క నాయకుడే మనస్సు కనుకనే ఇంద్రియములకు నాయకుడైన మనస్సుకు 'ఇంద్రుడు' అని పేరుపెట్టారు. ఈ మనస్సుకు పతి 'బుద్ధి' కనుకనే 'గణాధిపతి' అని ఇతనిని పిలుస్తూవచ్చారు. ఇక్కడ 'గణపతి' అనే పదమునకు అర్థమును చక్కగా గుర్తించాలి 'గ' అనగా బుద్ధి. అనగా విజ్ఞానము బుద్ధి విజ్ఞానములకు పతి గనుకనే ఇతనిని 'గణపతి' అన్నారు బుద్ధి మనస్సుకు అధిపతి మనస్సు ఇంద్రియములకు అధిపతి అన్ని గణములకు అధిపతి అయినవాడు కనుక ఇతనికి 'గణపతి' అని పేరు వచ్చింది.

సృష్టి కంటే అత్యంత అధికమైనటువంటిదే ఈ వ్యక్తిత్వం. ఈ వ్యక్తిత్వమనేది సృష్టి యొక్క అంతర్భాగమే కనుక దివ్యత్వమనేటటువంటి దైవత్వం మానవత్వమునందే యిమిడి వుంటున్నది. 'వినాయక' అనగా ఇతను సర్వస్వతంత్రుడైనవాడు. ఇతనికి మరొక నాయకుడు లేడు. ప్రపంచంలో ఏ వ్యక్తికైనా, ఏ శక్తికైనా ఒక నాయకత్వం ఉంటుంది. కాని వినాయకునకు మరొక నాయకుడు లేడు. కనుకనే ఇతనికి 'వినాయకుడు' అని పేరు వచ్చింది. సర్వ స్వతంత్రుడు వినాయకుడు ఈ వినాయక పూజ భారత దేశంలో అనాదికాలం నుండి వస్తున్నది. వేదములలో, ఉపనిషత్తులలో ఈ వినాయకుని యొక్క స్మృతి, స్మృతి అనేక విధముల ప్రబోధించబడింది గాయత్రి మంత్ర

యందు కూడా అంతర్భాగమై ఉన్నది గణపతి అనగా సర్వవ్యాపకమైన దివ్యశక్తియే. పార్వతీ పుత్రుడు గణపతి అంటున్నారు. ప్రకృతియే పార్వతి ప్రకృతి పరమాత్మల యొక్క దివ్యశక్తియే ఈ మానవత్వం ప్రతి మానవుడూ వినాయకుడే తాను ఈ శివశక్త్యాత్మక స్వరూపమైన దివ్యత్వానికి ఒక బిందువే కనుక ప్రకృతియే పార్వతి పురుషుడే ఈశ్వరుడు ఈ ప్రకృతి, పురుషుల యొక్క సంబంధమే ఈ యొక్క మానవత్వమనే వ్యక్తిత్వం, వినాయకుడనగా పార్వతీ పుత్రుడని, ఈశ్వరుడెక్కడో ఉంటున్నాడని, పార్వతి అనే శక్తి ఒకటి ఉన్నదని మనం భావిస్తుంటాం ఇది చాలా పొరపాటు సర్వమూ ప్రకృతి నుండి ఆవిర్భవించేటటువంటివే ప్రకృతి యొక్క అంశములే సర్వ భూతములు అట్టి పవిత్రమైన దివ్యత్వాన్ని గుర్తింపజేసే నిమిత్తమై, పర్వదినములన్నియూ ఒక ఆధ్యాత్మికమైన అంతరార్థములతో కూడివస్తున్నాయి.

ఈ వినాయకునకు ఏనుగు ముఖము, ఎలుక వాహనము ఏమిటి ? ఎలుకను 'మూషికము' అంటారు. రాత్రికి అనగా చీకటికి చిహ్నమే మూషికము. చీకటిని వినాయకుడు అణగద్రొక్కినవాడు కనుకనే ఇతనికి "మూషిక వాహనుడు" అని పేరు వచ్చింది. చీకటిని పారద్రోలి వెలుగును జగత్తుకు అందించేటటువంటి నాయకుడు వినాయకుడు. ఇంతేగాక మూషికమునకు వాసన యొక్క చిహ్నమని కూడా చెప్పవచ్చును ఈ మూషికము వాసన పురస్కరించుకొనియే తన ప్రయాణమును సాగిస్తుంది. అనగా కోరికలు, వాంఛలు అజ్ఞానమనేటటువంటి మూషికమును అణగద్రొక్కినటువంటివాడు వినాయకుడు అందువలన వినాయకుని యొక్క వాహనము 'మూషికము' అన్నారు వాహనమనగా ఏమిటి ? తన క్రింద వేసుకున్నదే వాహనము. దానిని ఎక్కినటువంటివాడు నాయకుడు సమస్త దుఃఖములను, బాధలను, కష్టములను దూరము గావించుకొనేటటువంటివాడు వినాయకుడు. విఘ్నములకు శత్రువు వినాయకుడు. విఘ్నమును సంహరించేటటువంటివాడు వినాయకుడు. అసలు విఘ్నములకు ఏ మాత్రం అవకాశమిచ్చేవాడేకాదు. సుఖశాంతులను అందించేటటువంటివాడు.

సిద్ధి బుద్ధులను అధిపతిగా చేసుకొనినటువంటివాడు వినాయకుడు. మనస్సు సుద్ధిగా ఉన్నప్పుడే జ్ఞానసిద్ధి లభిస్తుంది కనుక బుద్ధిసిద్ధినాయకుడు వినాయకుడు. ప్రతి మానవుడు బుద్ధిని అదుపులో ఉంచుకోవాలి. పండుగ దినాలలో మనం అనేక విధములైన వంటలు చేసుకుంటుంటాం. కాని వినాయక పండుగకు ఒక ప్రత్యేకమైన విశిష్ఠత ఉన్నది నూనెలో ఉడకని వస్తువులను మాత్రమే వినాయకునికి నైవేద్యంగా యిస్తుంటారు. కేవలం ఆవిరితో ఉడికినటువంటి వాటినే వినాయకునకు నైవేద్యం పెడుతాం ఆయుర్వేదంలో కూడా ఆవిరితో వుడికిన పిండివంటలు త్వరగా జీర్ణమవుతాయని పేర్కొనబడింది భాద్రపదమాసంలో నువ్వులు, బెల్లం వంటలు అధికంగా మన ఇండ్లకు వస్తుంటాయి. నువ్వులపిండి బెల్లం కలిపి దానిని, బియ్యం పిండిని ఆవిరిలో ఉడకపెట్టినదానిలో పెట్టి దీనినే కుడుములు ఉండ్రాళ్లు అని వినాయకునికి నైవేద్యం పెడుతుంటారు. బెల్లం కపపిత్తాదులను నివారించుతుంది, నువ్వులపిండి శ్వాస కోశములను పరిశుద్ధ పరుస్తుంది మరియు దృష్టిని కూడా అభివృద్ధి జేస్తుంది. బాహ్యదృష్టితో పాటు, జ్ఞాన దృష్టిని కూడా పోషించేటటువంటివి ఈ కుడుములు, ఉండ్రాళ్లు

భారతీయులు ఏనాడూ అర్థరహితమైన కర్మలు ఆచరించలేదు. ప్రతి పర్వదినమునకు ఒక విశిష్టమైన ఆధ్యాత్మిక అంతరార్థం కూడి ఉంటున్నది. సర్వ విద్యలకు నాయకుడు వినాయకుడు ఈ విద్యలనగా ఏమిటి ? కేవలం గ్రంథపఠనమే విద్యకాదు విద్య అనగా కేవలం బుద్ధికి సంబంధించినటువంటిది గ్రంథములతో చదివేటటువంటిని కేవలం చదువు జీవితమంతనూ ఒక విద్యాస్వరూపమే, విద్యామయమే ఏ విచారం చేసినప్పటికినీ, విచారజ్ఞానమంతయూ విద్యతో కూడి

నటువంటిదే. అయితే ఈ విచారము విజ్ఞతతో కూడి ఉంటుండాలి నిత్యానిత్య పరిశీలనా జ్ఞానమనేటటువంటిది విజ్ఞత. కేవలం చదువు విషయంలో మాత్రమే విద్యార్థులకు సహాయం చేసేటటువంటివాడు కాదు వినాయకుడు. జీవితమంతా, అడుగడుగునా, అణువణువునా కూడా సహాయం గావించేవాడు వినాయకుడు ఇతను సులభ ప్రసన్నుడు. సర్వత్రా దొరికేటటువంటి తుమ్మిపూలు, జిల్లేడుపూలు గడ్డి, రకరకములైన ఆకులతో వినాయకుని పూజిస్తారు. ఎందుకు? వినాయకుడు పూర్వం మృగముల చేత కూడ పూజింపబడేవాడని దీని అంతరార్థం. కనుకనే అతని ముఖము ఏనుగు ముఖము, వాహనము మూషికము వినాయకుని కేవలం మానవులేగాక, పశు పక్షి మృగాదులు కూడా పూజించేవని దీనివలన స్పష్టమవుతున్నది. సర్వ జీవులచేత పూజింపబడేవాడు, సర్వ జీవులకూ నాయకుడు వినాయకుడు ఒక దేశమునకు, ఒక కాలమునకు సంబంధించినవాడుకాదు వినాయకుడు సర్వ దేశములకు సర్వ కాలములకు, సర్వమానవులకు సంబంధించినవాడు వినాయకుడు

పురాణములు కొన్ని మంచి ప్రబోధలు చేస్తూ వచ్చాయి. మరికొన్ని హాస్యాస్పదమైన విషయాలను కూడా ప్రబోధించాయి ఒకానొక సమయంలో పార్వతీ ఈశ్వరుడు జూదము ఆడుచూ, తీర్పు చెప్పటానికి నందిని మధ్యవర్తిగా పెట్టుకున్నారట నంది ఈశ్వరుని యొక్క అభిమానిగదా! అందులో ఈశ్వరుని వాహనము గదా నంది. అందువలన పక్షపాత బుద్ధితో ఈశ్వరుడు ఓడినప్పటికినీ, గెలిచినట్లు ప్రకటించింది నంది. పార్వతికి కోపం వచ్చి "నయముకాని వ్యాధితో నీవు నశించిపోవుదువుగాక" అని పార్వతి నందిని శపించిందట. అప్పుడు నంది వచ్చి పార్వతి కాళ్ళపై పడి క్షమింపుమని వేడుకుంది. 'నా నాయకుని ఓటమి నాకు కూడా ఓటమేగదా! కనుక అతనిని గౌరవించే నిమిత్తం నేను అసత్యమాడినమాట నిజమే. దీనికి ఇంత పెద్ద శిక్ష నన్ను క్షమించు తల్లీ' అని నంది ప్రార్థించిందిట అప్పుడు పార్వతి క్షమించి, పాప పరిహారమును కూడా చెప్పింది. నా కుమారుడైన గణపతి పుట్టిన పండుగ భాద్రపద చతుర్థి దినము. ఆ దినమున నీవు తినేటటువంటిది, నీకు అత్యంత ప్రీతికరమైనటువంటి గరిక (గడ్డి)ను గణపతికి అర్పితం చేయమని చెప్పిందట. అనగా ఏది ఎవరికి ఏది ప్రీతికరమైనదో, ఆ ప్రీతికరమైనది అర్పితం చేసినప్పుడు అన్ని శాపములు విమోచనమవుతాయి కనుక తనకు అత్యంత ప్రీతికరమైనటువంటి గరికను తీసుకొనివచ్చి వినాయకుని పూజించింది నంది గణపతి అనుగ్రహంతో నంది యొక్క అనారోగ్యము నిర్మూలనమైంది. దేవీ కటాక్షంతో శాపవిమోచనమైంది.

కాశీ, ప్రయాగ, గయ మొదలగు క్షేత్రములకు వెళ్లినప్పుడు తమకు ఇష్టమైన ప్రీతికరమైన వస్తువులను వదలిపెట్టాలంటారు పెద్దలు. నీకు ఏది ఇష్టమో, నీకు ఏవి అమితమైన ప్రీతిగా ఉంటుందో, దానిని భగవంతునికి అర్పితం చేయి అట్టి అర్పణే నిజమైన అర్పణగాని, నీకు ఇష్టములేనిది ఇస్తే అర్పణకాదు. కూరగాయల యందుగాని, ఫలములయందుగాని, నీకు అమిత ఇష్టమైన వాటిని భగవంతునికి అర్పితం చేయాలి. అర్పితం చేసిన తరువాత, జీవితంలో తిరిగి ఆ ఫలమునుగాని, ఆ కూరగాయనుగాని భుజించకూడదు మన భారతీయులు ప్రాచీన కాలమునుండి పవిత్రమైన క్షేత్రములలో ఇలాంటివి అర్పితం చేస్తూ వస్తున్నారు. మనదేహమే కాశి. ఈ కాశి మధ్యలో గంగ ప్రవహిస్తున్నది, ఆ గంగయే మనయొక్క జ్ఞానము ఈ జ్ఞానమనే గంగయందు భక్తి శ్రద్ధ అనే యమునా సరస్వతులు లోనై పోతున్నాయి. భక్తి, శ్రద్ధ, జ్ఞానము- ఈ మూడింటియొక్క ఏకత్వమే ప్రయాగ మన హృదయ స్థానమే. కాబట్టి హృదయానికి పవిత్రమైనటువంటి, ప్రీతికరమైనటువంటి ఫలమును అర్పితం చేయాలి. కాని దురదృష్టవశాత్తు ఈనాడు, సాంప్ర

దాయములన్నియు కూడనూ, ఆధునికమైన Fashion క్రింద మారిపోయినాయి. ప్రయాగ పోతున్నాం. నీ కిష్టమైన పదార్థమును పరమాత్మకు అర్పితం చేయమని అక్కడ పండాలు చెబుతారు. ఇష్టమున్న దానిని గురించి యోచన చేయనవసరంలేదు ఇష్టంలేనిది ఏదాయని యోచించి, ఇష్టములేని కూరగాయను, ఇష్టంలేని ఫలమును అక్కడ అర్పితంచేసి వస్తున్నారు. ఇది కాదు, ఏది బాగా ఇష్టమైనదేదో, దానినే అక్కడ అర్పితం చేయాలి. నా భగవంతునకు, నా ప్రేమ స్వరూపునకు నాకు అత్యంత ప్రీతికరమైన పదార్థమును అర్పితం చేయాలనే దీక్ష మనలో ఆవిర్భవించాలి కాని ఆ విధంగా చేయటం లేదు నీ అయిష్టాన్ని అర్పితం చేస్తున్నావు. కనుకనే హృదయమునందున్న హృదయేశుడు 'తథాస్తు' 'తథాస్తు' అని ఆశీర్వదిస్తున్నాడు. నీవు చేసినట్లుగానే జరుగుగాక ! అనగా ఏమిటి ? భగవంతునకు ద్రోహం చేస్తున్నావు నీకు ఇష్టం ఉన్నది ఒకటి, అర్పితం చేసుకున్నది మరొకటి కనుక భగవంతునికి కూడాను తనకు ఇష్టములేనిదిఒకటి, ఇష్టమైనది మరొకటి ఇష్టములేనిదే వానికి కూడా అనుగ్రహిస్తుంటాడు 'నాకు ఆరోగ్యం కావాలి స్వామీ!' అంటే అనారోగ్యాన్ని అందిస్తున్నాడు. 'నాకు ధనం కావాలి స్వామి!' ప్రార్థించేవానికి దారిద్ర్యాన్ని అందిస్తున్నాడు, ఎందుకంటే, నీ ప్రార్థనలకు తగినటువంటి ఫలితమే. "యద్భావం తద్భవతి" నిజంగా నీ హృదయ పూర్వకంగా మంచిని అందిస్తే, భగవంతుడు మంచిని ఎందుకు అందించడు ? నీవు చెడ్డను అందిస్తున్నావు గనుకనే, నీవు చెడ్డనే పొందుతున్నావు కనుక నీకు పరిపూర్ణమైనటువంటి, ప్రేమతో వుండినటువంటిదానినే భగవంతునికి అర్పితం చేయాలి

హరిశ్చంద్రునకు ప్రాణసమానమైనటువంటిది సత్యం ఈ సత్యము నిమిత్తమై తాను ఏదైనా త్యాగం చేస్తానన్నాడు ఈ సత్యం కోసమే తన ఆలుబిడ్డలను కూడా అమ్మకున్నాడు. రాజ్యాన్ని కూడా వదలుకున్నాడు కట్టకడపటికి తనను తానే విక్రయింపబడ్డాడు. సత్యం కోసం పాటుపడ్డాడు. సత్యం భగవత్ స్వరూపము సత్యము యొక్క పేరు భగవంతుడు. భగవంతునియొక్క పేరు సత్యము. ఎక్కడ సత్యమో, అక్కడే భగవంతుడు. కనుక సత్యమును ఆరాధన చేయండి, సత్యభావములను అర్పితం చేయండి. సత్య సంకల్పము చేతనే సత్య స్థానమును పొందుతాం. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" కనుక మనం ఎట్టిది అర్పితం చేస్తామో అట్టి ఫలితమును మనం పొందుతాం.

ఈ సత్యమును ప్రబోధించినటువంటిదే వినాయక తత్త్వము "గజాసురుడు" అనే రాక్షసుడు ఒకడు ఉండేవాడు ఆతను కొంతకాలం తపస్సు చేయగా ఈశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు 'ఏం కావాలి' అని అడిగాడు 'మీరు నా కడుపులో చేరిపోవాలి' అని అడిగాడు గజాసురుడు ఇచ్చిన మాట ప్రకారం ఈశ్వరుడు గజాసురుని కడుపులో చేరాడు ఈశ్వరుని కోసం పార్వతి వెతికి వెతికి విసిగిపోయి చిట్టచివర్కి విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళి చెప్పింది. భర్త అయిన ఈశ్వరుని వప్పజెప్పుతానని పార్వతికి హామీ ఇచ్చాడు విష్ణుమూర్తి. నందికి గంగిరెద్దు వేషం వేసి, తాను మేళం వాయించుకుంటూ, గజాసురుని దగ్గరకు వెళ్ళాడు. గంగిరెద్దు నాట్యం చూసి మెచ్చుకొని 'నీకేం కావాలి' అని అడిగాడు మారు వేషంలో నున్న విష్ణుమూర్తిని గజాసురుడు 'మాట తప్పకుండా ఇస్తావా ?' అని అడిగాడు మారువేషంలోనున్న విష్ణుమూర్తి. 'తప్పకుండా ఇస్తాను' అన్నాడు గజాసురుడు. అప్పుడు నీ కడుపులోనున్న ఈశ్వరుని ఇవ్వాలి అన్నాడు. ఈ సత్యమును తెల్పినవాడు ఒక్క విష్ణుమూర్తి తప్ప మరెవరో కాదని గ్రహించి పాదములపైబడి 'స్వామి ! నా రహస్యము నీకు తప్ప అన్యులకు ఎవరికి తెలియదు. నేను ఇచ్చిన మాట ప్రకారం నా ప్రాణమునయినా అర్పితం చేస్తాను కాని ఒక చిన్న విన్నపము అని చెబుతూ గజాసురుడు. అయితే నా శిరస్సును మాత్రం నిరంతరం సర్వులకు పూజనీయమైన రీతిలో తీర్చిదిద్దాలని కోరాడు.

నా చర్మమును నీవు ధరించాలన్నాడు తప్పక ధరిస్తానని చెప్పాడు విష్ణుమూర్తి. అందువలననే ఏనుగు చర్మాన్ని విష్ణుమూర్తి ధరించడం గజాసురుని శిరస్సును గణపతిపై పెట్టడం జరిగింది. ఇవన్నీ కథలు....కథలు. అయితే ప్రజలమనస్సులను దైవమార్గంలో ఆకర్షించే నిమిత్తమై ఇలాంటి కథలు చెప్పారేమో ననిపిస్తుంది. నిజముగా విచారిస్తే దైవత్వమొక్కటే సర్వుల యందూ వుండినటువంటి దైవం ఒక్కడే. వినాయకుడు మనకంటే భిన్నమైనటువంటివాడు కాదు మన హృదయ వాసి అయినటువంటి తత్వమే, దివ్యత్వమైనటువంటి ఆత్మతత్వము. అతనే అన్నిగణములకు నాథుడు.

వినాయకుని భార్యలపేర్లు బుద్ధి సిద్ధి అన్నారు అనగా ఈ బుద్ధికి, జ్ఞానమునకు అధిపతి అయినటువంటి వాడు కనుక వినాయకుడు. ఈ రెండింటికినీ 'పతి'గా భావిస్తూ వచ్చారు. బుద్ధికి నాథుడైన వానివలనే మనకు సుఖము, జ్ఞానము, ఆనందము ప్రాప్తిస్తుంది కనుక మనం సుఖజీవితం గడపాలనుకుంటే, ఇంద్రియములను భగవదర్పితం గావించాలి మన మనస్సును భగవంతుని వైపు మరల్చాలి బుద్ధికే మనం స్వాధీనం అయి పోవాలి. దీనినే''బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్'' అన్నారు శరీరము కేవలము పదార్థములచేరిక. దీనికి పైన ఉన్నటువంటివి ఇంద్రియములు. ఇంద్రియములకు పైన మనస్సు. మనస్సుకు పైన బుద్ధి బుద్ధికి పైన ఉన్నది ఆత్మ ఆత్మకు బుద్ధికి Direct Connection ఉన్నది. ఆత్మయొక్క తేజస్సు, ప్రశాంతి మొదట బుద్ధికి సోకుతుంది కనుక బుద్ధిని సరియైన బుద్ధిగా మనం పోషించుకోవాలి మంచి బుద్ధిగలవాడే సరియైన జ్ఞాని అవుతాడు. కనుక బుద్ధియొక్క సుద్ధియే 'జ్ఞానసిద్ధి' అన్నారు.

ఈ ప్రపంచములో ఏ శుభకార్యమును ప్రారంభించ డానికి పూనుకున్నా మొట్టమొదట వినాయకుని పూజిస్తారు. సర్వకార్యములకు ప్రప్రథమ పూజార్హుడు వినాయకుడు. ఎక్కడ ఉన్నటువంటి వినాయకుణ్ణి పూజించాలి? వినాయకుడు బయట లేడు. నీ హృదయ స్థానంలోనే ఉన్నాడు హృదయంమీద చేయివేసుకొని 'నా హృదయసాక్షిగా నేను చెబుతున్నాను' అనిఅంటారు కనుక మనం ఏమిచేసినా హృదయసాక్షిగా మనం చేయాలి ఎవరో ఒకరిని మెప్పించడానికి మనం మాట్లాడ రాదు ఎవరినో నుండి తప్పించుకోవాలని మాట్లాడ కూడదు. ఎవరితోనయినా నీవు తప్పించుకోవచ్చును కాని దైవముతో మాత్రం నీవు తప్పించుకోలేవు, ఎవరి నయినా నీవు మోసం చేయవచ్చును కాని దైవాన్ని మాత్రం నీవు మోసం చేయలేవు కనుక దైవత్వాన్ని చక్కగా గుర్తించడానికి ప్రయత్నించాలి. ఇవన్నీ దేహతత్వాలే ఈ దేహాలతో కూడినటువంటివి ఎంత కాలం సత్యం? ఇది కేవలం ఒక తోలుబొమ్మ ''అందం, ప్రాయం, ఇంద్రియశక్తి వుందని విక్కకు రోరన్నా!'' ఎంతకాలం ఈ ఇంద్రియ శక్తి? ఎంత కాలం ఈ యవ్వనం? ముందున్నదిరా తొందరలోనే ముసలితనమ్మను ముసళ్ళపండుగ'' అప్పుడు నీవు ఎవర్ని ప్రార్థిస్తావు? కనుక నీవు తప్పించుకోవటానికి వీలుకాదు. ''మసలలేవు కనుమసకలు మోమున ముడతలుబడె తలనెరిసెనుగా!" అప్పుడు నీవు ఏమి చేయగలుగుతావు? ఏమీచేయలేవు. కనుక మొట్ట మొదట పవిత్రమైనటువంటి, పరిపక్వస్థితి యొక్క తత్వాన్ని, ఫలమైనటువంటి స్వరూపాన్ని భగవదర్పితం గావించాలి, భగవంతునికి మంచి ఫలమునే యివ్వాలి. ఆదేవిధముగా మన పవిత్ర సంకల్పములనే భగవంతునికి అర్పితం గావించాలి. అదియే వినాయక చవితియొక్క పరమార్థం, ఈ అంతరార్థమును మనం గుర్తించుకోలేక, ఏవో మట్టిబొమ్మలు తెచ్చి, పనికిరాని చెత్తంతా పెట్టి, మనకు అవసరము లేనటువంటి దంతా భగవంతునికిచ్చి, భగవంతుని నుండి మనకు అవసర మైనది పొందుతున్నాం, ఇది పెద్ద వడ్డీవ్యాపారం, ఇది కాదు మనం చేయవలసినది. భగవంతునికి పవిత్రమై నటువంటిది యివ్వాలి ఆవులు వుంటున్నాయి. వీటికి

పనికిరాని గడ్డిని వేస్తున్నాం. అన్నం వండి వార్చి పారబోసే గంజిని పోస్తున్నాం. మనకు పనికిరాని వస్తువులను తాను భుజించి, మనకు అవసరమైన, పవిత్రమైన పాలను అందిస్తున్నాయి కాని ఈనాటి మానవుడు పవిత్రాన్ని తాను ఉంచుకొని, అపవిత్రాన్ని భగవంతునికి అందిస్తున్నాడు, ఇదికాదు భగవంతునికి ప్రీతికరమైనది అందించాలి, ఓ భగవంతుడా! నాకు అది కావాలి! ఇది కావాలి! అని ఆశిస్తున్నాం ఈ ఆశించే అధికారం నీకు ఎప్పుడు వస్తుంది? భగవంతుడి ప్రీతికరమైన పనులు చేసినప్పుడే ఈ అధికారం నీకు వస్తుంది. భగవంతుడికి ప్రీతికరమైన కర్మలను నీవు ఆచరించక, నాకు ప్రీతికరమైనది అందించమంటే, ఇది సాధ్యమయ్యేది కాదు. కనుక మొట్టమొదట భగవంతుడికి ప్రీతికరమైనది చేయాలి, అప్పుడు భగవంతుడు కూడనూ నీకు ప్రీతికరమైనది అందిస్తాడు, కనుక మొట్టమొదట భగవంతుడికి ఏదీ ఇష్టమో దానిని గుర్తించడానికి ప్రయత్నించాలి. ఏది ఇష్టములేదు సర్వమూ తనయందే ఉంటున్నాయి. కాని మిమ్మలను తరింపజేసే నిమిత్తమై తనకు ఇష్టము ఉన్నట్లుగా నటిస్తాడు భగవంతుడు.

ఒక రాజు ఉండేవాడు. అతని సేవకులు చెరకుగడను తెచ్చి పైనున్న పీచును శుభ్రంగా తీసివేసి లోపలనున్న మాధుర్యమైన చెఱకురసమును ప్రతిరోజు అందిస్తుండేవారు. ఒక రోజున నేనే ఈ చెఱకుగడను కోసి తినాలనే కోరిక కలిగింది రాజుకు. చెఱకుగడను పట్టుకొని కత్తితో నరికాడు పొరపాటున చెఱకుగడతోపాటు రాజుగారి వ్రేలు కూడా తెగిపోయింది. రక్తం కారుతున్నది ప్రక్కనున్న మంత్రి రాజును చూచి 'అంతా మన మేలుకొఱకే జరిగింది' అన్నాడు రాజుకు కోపం వచ్చింది. ఆ మంత్రిని జైలులో పెట్టించాడు. మంత్రి జైలులోనికి వెళ్ళుతూ 'మహారాజా! అంతయూ నా మేలుకొరకే జరిగింది' అని నవ్వుతూ వెళ్ళాడు. రాజుకు ఆశ్చర్యం వేసింది. వ్రేలు పోవటం నా మంచికన్నాడు, జైలుకు పోవడం అతనిమంచికన్నాడు దీని అంతరార్థమేమిటా ? అని ఆలోచనలోపడ్డాడు రాజు. కొంతకాలం తరువాత అరణ్యానికి వేటకెళ్ళాడు. వేటాడి వేటాడి అలసిపోయి ఒక చెట్టు క్రింద శయనించాడు ఆ రాజు అలసిపోవడం వలన గాఢంగా నిద్రపట్టింది. ఆనాడు అడవిజాతివారు ఒక పండుగచేసుకుంటున్నారు. ఆ సందర్భమున తమ కులదేవతకు మంచి ఆరోగ్యం గల, దారుఢ్యంగల దేహాన్ని బలియివ్వటం వాళ్ళ సంప్రదాయం ఆ అడవి రాజు తన సేవకులను ఒక మంచి దారుఢ్యంగల వ్యక్తిని బలివ్వటానికి తీసుకొని రమ్మనమని పంపించాడు. ఆ సేవకులు అరణ్యంలో తిరుగుతూ తిరుగుతూ నిద్రిస్తున్న రాజుగారి వద్దకువచ్చి చూచి, తమ కులదేవతకు బలివ్వటానికి తగిన వ్యక్తి దొరికాడని భావించి, ఆ రాజును కట్టివేసి ఆ అడవిరాజు వద్దకు తీసుకొని వెళ్లారు. మరునాడు ఉదయం శుభ్రంగా స్నానం చేయించి క్రొత్తబట్టలుకట్టి, పసుపు కుంకుమలు వ్రాసి, వేపాకు వంటికి కట్టి డప్పులు వాయిస్తూ, కోలాహలంగా బలియివ్వటానికి దేవివద్దకు తీసుకొనివెళ్లారు. ఆ దేవివద్ద పూజారి ఈ రాజును చూచాడు. దైవమునకు అర్పితం చేసేదాంట్లో ఎలాంటి దోషమూ ఉండకూడదని భావించి ఆ రాజును నఖశిఖ పర్యంతం పరిశీలించగా, ఆ రాజుకు ఒక వ్రేలు లేనట్లుగాగుర్తించాడు ఆ పూజారి అంగవిహీనమైన వ్యక్తిని దైవమునకు అర్పితం (బలి) చేయకూడదని భావించి ఆ రాజును వదలివేయమని పూజారి ఆజ్ఞాపిస్తాడు వ్రేలు లేకపోవటం వలననే కదా ! నా ప్రాణం దక్కిందని ఆ రాజు తెలుసుకొని, మంత్రి ఆనాడు చెప్పింది ఈనాడు సత్యముగా ఋజువైందని సంతోషించి, సరాసరి మంత్రి ఉన్న జైలుకు వెళ్ళి 'మంత్రీ నీవు చెప్పింది సత్యం నాకు వ్రేలు పోవటం వలననే, నేను ఈనాడు బ్రతికాను. ఇది నా మంచికే జరిగింది' అయితే నీవు జైలుకు వెళ్లేటప్పుడు 'నా మంచికే' అన్నావు. 'ఏమిటి నీ మంచి ?' అని అడిగాడు రాజు. అప్పుడు ఆ మంత్రి 'మహారాజా !

## యక్షప్రశ్నలకు సమాధానములు

" దాక్ష్యమేకపదం ధర్మ్యం
దానమేకపదం యశః
సత్యమేకపదం స్వర్గ్యం
శీలమేకపదం సుఖమ్"

- ధర్మరాజు

ధర్మానికి సామర్థ్యమూ, కీర్తికి దానమూ, స్వర్గానికి సత్యమూ, సుఖానికి శీలమూ ప్రధాన ఆశ్రయాలు.

---

నన్ను జైలులో పెట్టకపోతే మీ వెంట అడవికి వచ్చే వాడనుకదా ! నీవు అంగహీనుడవు కాబట్టి వాళ్ళు నిన్ను బలియివ్వకుండా వదిలేశారు నా అవయవాలన్నీ బాగున్నాయి కాబట్టి, నిన్ను వదలి నన్ను బలియిచ్చే వారు కదా!' అన్నాడు మంత్రి కనుక నన్ను జైలులో పెట్టటం నా మంచికే జరిగిందిగదా అన్నాడు మంత్రి 'వ్రేలు లేకపోవటంవలన నీ ప్రాణం దక్కింది అది నీ మంచికే జరిగింది. జైలుకు పోవడంవలన నేను బ్రతికాను అది నా మంచికే జరిగింది' అన్నాడు మంత్రి, మనకు ఏమి జరిగినా 'అంతయూ మన మేలు వకే' అనే సత్యాన్ని గుర్తించినప్పుడే దైవత్వము యొక్క అనుగ్రహం మనకు దండిగా, నిండుగా లభ్యమవుతుంది కేవలం నీయొక్క భావాన్ని నీవు అనుసరిస్తూ పోతుంటె దైవము యొక్క విశాలమైన తత్త్వమును నీవు ఎప్పుడు అనుసరిస్తావు ? దైవము ఏమి చెప్పినా, ఏమి చేసినా అంతా నా మంచికేననే దృఢమైన విశ్వాసాన్ని పెంచుకోవాలి దానినే మన భారతీయ పర్వదినాలు ప్రబోధిస్తున్నాయి ప్రతి పర్వదినమూ ఒక అంతరార్థమును, అధ్యాత్మికతను బోధిస్తున్నవి కాని ఈనాటి ఆధునిక విద్యార్థులు మాత్రం అవగాహన చేసుకొనలేక, అంతరార్థమును అర్థం చేసుకోలేక సత్యమును గుర్తించలేకపోతున్నారు తుచ్ఛమైన ఈ జీవిత నిమిత్తమై ప్రాకులాడుతున్నారు. కాదు .... కాదు మన చదువు మన జీవిత నిమిత్తంగాని, జీవనోపాధి నిమిత్తం కాదు (Education is for life not for living) కాని ఈనాడు జీవించడానికి పోరాడుతున్నాము కాదు ఆదర్శంకోసం పోరాడాలి ఆదర్శప్రాయులుగా అభివృద్ధికావాలి. వినాయకతత్త్వము విశిష్టమైన విజ్ఞానతతో కూడినటువంటిది. సర్వవిఘ్నములను మొట్టమొదట హెచ్చరిస్తుంటాడు. చెడ్డ ఏమైనా చేయటానికి మనం పూనుకుంటేవద్దు .... వద్దు .... అని హెచ్చరిస్తుంటాడు వినాయకుడు. కాని నీవు దానిని లెక్కచేయటంలేదు, పోతున్నావు కట్టకడపటికి బాధలు పడుతున్నావు. నిజంగా నీవు వాటిని అమలుచేస్తే నీవు ఎంతో బాగుపడతావు

మొట్టమొదట దైవాజ్ఞ మీరు అనుసరించండి దైవాజ్ఞలను శిరసావహించండి అదియే మీకు నిజమైనటువంటి రక్ష, పరమాత్మని ప్రేమభిక్ష ఇదియే ప్రేమతత్త్వము యొక్క మహాశక్తి ఒక్క గణపతి మాత్రమే పార్వతీ పుత్రుడు కాదు, అందరూ పార్వతీ పుత్రులే. అనగా పృథ్వీపుత్రులే. అట్టి సత్యాన్ని మనం గుర్తించాలి ఒక్కసారి వినాయక తత్త్వాన్ని హృదయమునందు వున్నట్లుగా మనం భావించుకుంటే, సర్వశక్తులూ మనలో ప్రవేశిస్తాయి పంచభూతములనూ స్వాధీనం చేసుకొనినవాడు వినాయకుడు. అట్టి దివ్యత్వాన్ని ఒక్క పర్యాయం స్మరిస్తే, అన్ని బాధలూ నివారణ అవుతాయి. కనుక భగవత్ తత్త్వాన్ని చక్కగా, విశ్వాసంగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి

మనం ఏ భజన ప్రారంభించినా మొట్టమొదట వినాయకుని పాట పాడుతాం. ఎందుకు పాడాలి ? మనం 'ఓం' కారముతో ప్రారంభిస్తాం. ఇది ప్రణవము. ప్రణవము అనేటటువంటిది ముందూ వెనుక రెండూ ఉండాలి ఈ ప్రణవము అనేటటువంటిది ముందు ఇంజను, వెనుక గార్డు పెట్టె కాని ఈనాడు ప్రణవము లేకపోవటం చేతనే ప్రళయము వచ్చి పడిపోతున్నది కనుక మొట్టమొదట 'ఓం'. ఈ తత్త్వం లోపల రెండవది వినాయక తత్త్వం ఈ రెండింటియొక్క ఏకత్వంతో వుండినప్పుడే మన జీవితం సార్థకమవుతుంది.

(ది 29-8-1995 న ప్రశాంతినిలయంలో వినాయక చతుర్థి సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)

కృష్ణాష్టమి సందేశం

# ప్రేమతో పరమాత్మను వశం చేసుకోండి!

—భగవాన్ సాయి దివ్య బోధ

ప్రేమ స్వరూపులారా!

శాంతమునకు మించిన తపస్సు మరొకటి లేదు. శాంతమే మానవుని ప్రధానమైన విలువ. శాంతమే మహర్షులయొక్క సౌందర్యం, శాంతము లేక సౌఖ్యము లేదన్నాడు త్యాగరాజు. సంతోషం కంటె మరో సుఖం లేదు. మానవుడు సుఖమునే కోరుతుంటాడు. అనేక విధములైన సుఖముల నాశిస్తుంటాడు కాని శాంతికి మించిన సుఖం మరొకటి లేదు సంతోషముకన్న స్వర్గమేది?

ఈనాటి మానవుణ్ణి ఆశలు పట్టి పీడిస్తున్నాయి ఈ ఆశలే అనేక విధములైన రోగములకు హేతువవుతున్నాయి. వాంఛలకు కూడా ఒక పరిమితం! ఉండాలి. అయితే ఈనాడు వాంఛలు మితిమీరి పోతున్నాయి. కనుకనే రోగములు కూడా మితిమీరుతున్నాయి ఈ కోరికల వలన అనేక మానసిక అశాంతులు అభివృద్ధియై, తద్వారా శారీరకమైన రోగములు పెంపొందుతున్నాయి కనుక కోరికలను అదుపులో వుంచుకోవటానికి తగిన కృషి చేయాలి

దయయే ప్రధానమైన ధర్మము. దయకు మించిన ధర్మం వేరొకటి లేదు. 'దయగల హృదయమే దైవ మందిరం'. కనుక ప్రతి మానవుడు దయాహృదయుడు కావాలి ప్రతి అక్షరం మంత్రమే ప్రతి వృక్షం ఔషధమే, ప్రతి మానవుడు అవసరమే ఈ సత్యమును గుర్తించి, వర్తించి నటువంటి వ్యక్తే నిజమైన వ్యక్తి, ఈనాడు మనిషియొక్క విలువను కాలముయొక్క విలువను గుర్తించుకోలేక పోతున్నారు.

ఈ ప్రపంచమంతయునూ భగవంతుని సృష్టియే. ఇది మహా శక్తివంతమైనది. ఈ శక్తి సర్వత్రా వుండినప్పటికినీ మానవుడు ఈ దివ్యమైన శక్తిని గుర్తించుకోడానికి ప్రయత్నించడంలేదు గుర్తించుకోలేక ఈ శక్తియే లేదని భావిస్తున్నారు. విద్యుచ్ఛక్తి తీగెల యందు సర్వత్రా వ్యాపించి ఉంటుంది కాని ఎక్కడ బల్బును తగిలిస్తామో, అక్కడనే దీనియొక్క ప్రకాశం మనకు గోచరమవుతుంది ఈ కరెంటు సర్వత్రా సంచరించుతూ ఉండినప్పటికినీ, పరిశుద్ధమైన బల్బు ఎక్కడతగిలించుదురో, అక్కడ మాత్రమే దీనియొక్క ప్రకాశము ప్రజ్వరిల్లుతూఉంటుంది అటులనే భగవంతుడు సర్వవ్యాపకుడైనప్పటికినీ, అతనియందు ఎవని చిత్తము పవిత్రమైన ప్రేమతో హత్తుకొనునో, అట్టివారియందు మాత్రమే ఈ దివ్యత్వము ప్రకాశిస్తూ ఉంటుంది. ఈనాటి మానవుడు జీవితమంటే ఏమిటి? దీని గమ్యమేమిటి? లక్ష్యమేమిటి? కర్తవ్యమేమిటి? అనేటటువంటి దానిని గుర్తించుకోలేకపోతున్నాడు. కాలము ప్రచండ మారుతమువలె అతి వేగముగా కదిలి పోతున్నది ఆయుఃప్రమాణం మంచుగడ్డవలె కరిగి పోతున్నది కాని మానవుడు తన కర్తవ్యాన్ని గుర్తించక మునుపే కన్ను మూస్తున్నాడు. ఏమిటి ఈ కర్తవ్యం? ప్రతి వ్యక్తికి కొన్ని ఆశయాలుంటున్నాయి కొన్ని లక్ష్యాలుంటున్నాయి. వీటి నిమిత్తమై మానవుడు తగిన కృషి చేయటంలేదు ఏమిటి తన జీవిత లక్ష్యం? ఏమిటి తన జీవిత కర్తవ్యం? తన జన్మ యొక్క రహస్యమేమిటి? వీటిని గురించి ఏవ్యక్తీ ప్రశ్నించుకోవటంలేదు, ఆలోచించటంలేదు. కేవలం

ండి విద్రలతో మాత్రమే జీవితాన్ని గడుపుతున్నాడు. ోగభాగ్యములతోనే కాలం గడుపుతున్నాడు ఇదికాదు మానవుని యొక్క లక్ష్యము ఇది కాదు మానవుని యొక్క కర్తవ్యం. ఇదికాదు మానవుని యొక్క క్ష్యము ప్రతి వ్యక్తి దివ్యమైన ఆదర్శమును రూపించాలి. కాని ఈనాటి మానవుడు అట్టి పవిత్రమైన మార్గంలో ప్రవేశించటంలేదు

ప్రతి ఒక్కటీ మానవునియొక్క సంకల్పముల యందునే యిమిడి ఉంటున్నది ఈ సంకల్పముల యందు ఉండినటువంటిది ప్రతిదీ బహిర్ముఖంగా ఆవిర్భవిస్తూ ఉన్నది. The Reflection of the Inner Being ఒక చిన్న ఉదాహరణ మనం ఒక గృహమును నిర్మించవలెననిన ఏ గది ఎక్కడ ఉండాలో ముందుగా సంకల్పించుకొని తదుపరి కాగితము మీద ప్లాను గీయిస్తాము. అనగా తనయందు గృహముయొక్క ఆకారాలు సంకల్పించబడి, ఆ సంకల్పించబడిన భావమే తదుపరి రూపమును ధరిస్తుంది కనుక మొదట సంకల్పం ఉండవలె ఆచరణ సంకల్పం వుండటం చేతనే ఆచరణ ప్రాప్తిస్తుంది సంకల్పమే లేకుండిన ఆచరణలో ప్రవేశించుటకే వీలుకాదు కనుక పవిత్రమైన సంకల్పములు అభివృద్ధి పరచుకోవాలి ఈనాటి మానవుని దుఃఖములకు, విచారములకు, కష్టములకు, నష్టములకు తమ యొక్క సంకల్పములే మూలకారణమనే సత్యాన్ని ప్రతి వ్యక్తి గుర్తించాలి. తమ కష్టములకు, నష్టములకు, దుఃఖములకు ఎవరో కారణమని భావిస్తున్నాడు. మంచి చెడ్డలకు నీవే కారణము గాని మరొకరుకాదు. బలహీనతచేత ఇతరులపైన నెపములు వేసి వారిని నిందించి, దూషిస్తున్నావు ఇది పొరపాటు మన మంచి చెడ్డలకు మనమే కారణమనే సత్యమును ప్రతి వ్యక్తి ప్రప్రథమంలో గుర్తించాలి. 'యద్భావం తద్భవతి'' ఉపనిషత్ కూడా దీనిని చక్కగా వివరించింది. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అనగా దేనిని చింతిస్తున్నావో, ఆ రూపమునే నీవు పొందుతున్నావు. నిరంతరం రామచింతన చేయటంచేతనే, రామభావములు రామతేజస్సు, రాముని గుణములు వాల్మీకిలో ప్రవేశించాయి. దొంగయైనటువంటి రత్నాకరుని మోహమునందు, ఈ దివ్యమైన తేజస్సు ప్రకాశించడం, రామ చింతన యొక్క విచిత్రమే. కనుక ఎవరి తేజస్సును గురించి మనం చింతిస్తుంటామో, ఆ తేజస్సు ఒక అంశంగా మనలో ప్రవేశిస్తుంటుంది ప్రహ్లాదుడు సర్వకాల సర్వావస్థలయందు హరినామమునే చింతిస్తూరావటం వలన, ఎట్టి కష్టనష్టములకైనా వెరువక, దివ్యమైన, నవ్యమైన, భవ్యమైన, పవిత్రమైన ఆనందమును అనుభవిస్తూవచ్చాడు విష్ణువు యొక్క తేజస్సు ఆ ప్రహ్లాదుని మోహంలో తాండవమాడుతూ వచ్చింది దీనినే 'యద్భావం తద్భవతి' అదే 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' దేనిని గురించి మనం చింతిస్తుంటామో దాని యొక్క స్వరూపము, దాని తేజస్సు మనలో అంశంగా ప్రవేశిస్తుంది

ఈ నాటి మానవుడు ఎవరి అంశం? ''మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతః'' కొమ్మ చెట్టుకు అంశం బిడ్డ తల్లికి అంశం, చెట్టులేకపోతే కొమ్మ బ్రతకదు, తల్లిలేకపోతే బిడ్డఉండదు మానవుడు మాధవుని యొక్క అంశం– జీవుడు దేవునియొక్క అంశం కనుకనే మాధవుడు లేకుండా మానవుడు బ్రతకలేడు, దేవుడు లేకుండా జీవుడు బ్రతకలేడు అయితే ఈనాడు బ్రతుకుతున్నాడే! ఎట్లా బతుకుతున్నాడు? ఏ రీతిగా బ్రతుకుతున్నాడు? పశువుగామాత్రమే బ్రతుకుతున్నాడు భగవంతుని అంశమే నీయందు వుండినప్పుడు నీవు ఈ చింతలకు ఎందుకు అవకాశం యిస్తున్నావు? నీవు ఎందుకు కష్టములకు గురిఅవుతున్నావు? భగవంతునికి కష్టములున్నవా? , విచారములున్నవా? ఏమీలేవు. ''నిత్యానందం పరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం'' నా అంశమే నీవైనప్పుడు నీవు ఎందుకు ఈ బాధలకు గురి అవుతున్నావు! దీనిని నీవు చక్కగా విచారించుకున్నప్పుడు నేను దైవాంశంగా బ్రతకటంలేదే? అనేది తెలుస్తుంది. "నేను దైవాంశంగా బ్రతకాలి''

అని ఒక ప్రతిజ్ఞను పూనాలి. I & you are one అని నిరంతరం భగవంతుని చింతించడం వలన జీసస్ ముఖంలో భగవత్ తేజస్సు, ఉట్టిపడింది. ఈ విధమైన భావములు నిరంతరం మన హృదయం లోపలనూ ఆవిర్భవించాలి అయితే ఈనాడు క్షణ క్షణమునకు ఒక్కొక్కరిని గురించి చింతిస్తున్నావు కనుక నీవు మనసులేని మానవుడు గానే జీవిస్తున్నావు, ఇది కాదు సరియైనటువంటిది, మనం భగవంతుని అంశమని భావించుకున్నప్పుడు. మనం భగవంతుని యొక్క జీవితాన్ని మనం గడపాలి.

అంథోని అనే అతను ఇటలీ దేశంలో ఉండేవాడు. అతను వయొలిన్‌లో ప్రముఖ విద్వాంసుడు ఆంథోని వయొలిన్ అంటే చాలా పేరున్నది అతను ఒక్కొక్క వయొలిన్‌ను తీర్చిదిద్ది మంచిగా తయారుచేయడానికి ఒక సంవత్సర కాలం తీసుకొనేవాడు ఒక పర్యాయం అతని మిత్రుడు వచ్చి ఆంథోని ! ఒక్క వయొలిన్‌ను తయారు చేయటానికి ఒక సంవత్సరం తీసుకుంటే, జీవితం ఏ రీతిగా జరుగుతుంది ? ఈ భౌతిక జీవితం గడపాలి గదా! సంవత్సరానికి ఒక్క వయొలిన్ చేస్తే జీవితం గడవదు" అని అంటాడు. అప్పుడు ఆంథోని "భగవంతుడు పూర్ణస్వరూపుడు, అతని పూర్ణస్వరూపానికి తగినటువంటి పూర్ణమైనటువంటి వయొలిన్‌నే చేయాలి. నేను పూర్ణమైనటువంటి వయొలిన్‌ను చేయకపోతే భగవంతునికి ద్రోహం చేసిన వాడనవుతాను. అతని హృదయం పరిపూర్ణమైనటువంటిది, భగవంతుడు పూర్ణ స్వరూపుడు అతనిని సంతృప్తి పరచాలంటే, మనం తలచే తలపులు, చేసే పనులు, పలికే పలుకులు అన్నీ పరిపూర్ణ మైనటువంటివిగా ఉండాలి" అని అంటాడు. కనుక పరిపూర్ణుడైన భగవంతుని మెప్పించాలంటే మనం నాల్గోవంతో, మూడోవంతో, సగమో మనం కాకూడదు మనము పరిపూర్ణులమే కావాలి, ఎందుకంటే మనం ఆయన అంశమే కాబట్టి. ఆ పరిపూర్ణుడైన భగవంతుని సంతృప్తి పరచాలంటే, మనం కూడా పరిపూర్ణులం కావాలి. పలికె పలుకు పరిపూర్ణసత్యంగా ఉండాలి. నడిచే నడకలు కూడను భగవంతునియొక్క పరిపూర్ణతను మనం నిరూపించాలి మనం తలచే తలపులు కూడనూ భగవంతునియొక్క సంకల్పముగా భావించాలి. ఎందుకనగా ఆయన అంతర్యామి. అతని నుంచి వచ్చేటటువంటి పలుకులే గాని మరొక పలుకులు కావు. అతనే మనయందు ఉంటున్నాడు కాని మరొకరు లేరు. అందువలననే 'బ్రహ్మార్పణ. బ్రహ్మవిత్' అన్నారు. అనగా 'బ్రహ్మార్పణం' చేస్తున్నాం, కాని ఈనాడు 'కృష్ణార్పణం' అని అంటున్నాము 'కృష్ణార్పణ' గావిస్తున్నాం. కాదు....కాదు. చెప్పేది ఒకటి, చేసేది మరొకటి. కనుకనే మనం బాధలను దూరం చేసుకోలేక పోతున్నాం. అనుకున్న ఆనందాన్ని అనుభవించలేక పోతున్నాం. పొందవలసిన గమ్యాన్ని పొందలేక పోతున్నాం. తెలుసుకోవలసిన సత్యమును తెలుసుకోలేకపోతున్నాం ఈ జీవితం ఇంతే.... ఇంతే....ఏనాడు ఈ మానవుడు పరిపూర్ణత్వాన్ని చక్కగా గుర్తించుకోగలడో, ఆనాడే మన జీవితం పరిపూర్ణ మవుతుంది. ఆనాటి గోపికలు కూడనూ ఇదే మార్గమును అనుసరిస్తూ వచ్చారు పరిపూర్ణ హృదయులు వారు, ఏ ఒక్క దానిని గురించి చింతించేటటువంటివారు కాదు. ఉద్ధవుడు తీసుకొని వచ్చిన సమాచారమును కూడా తీసుకొనలేదు "ఉద్ధవా! మా కన్నుల నిండా కృష్ణుని యొక్క చల్లని రూపు కనిపిస్తున్నది మా నాలుక మీద కృష్ణ నామం నాట్యమాడు తున్నది. మా మనసు కృష్ణుని యొక్క మధురమైన దివ్యత్వాన్ని అనుభవిస్తున్నది ఆ మురళీ నాదమునే మా కర్ణానందముగా గ్రోలుతున్నాము ఎంగకు ఈ పిచ్చి సమాచారములు మా కెందుకు? మాకు అవసరం లేదు" అన్నారు అనగా అంత సంపూర్ణమైనటువంటి పరిపూర్ణతను పొందినటువంటి వారు గోపికలు ఇంతే కాదు ఏకాత్మ భావం వారి యందు సమృద్ధిగా ఉండేటటువంటిది

కృష్ణుడు 8 సంవత్సరముల బాలుడు. అతను గోపికలతో ఆడుతూ పాడుతూ ఉండేవాడు దురదృష్టవశాత్తు

భారతీయులు కూడనూ ఈ సత్యమును గుర్తించుకోలేక పోయి కృష్ణుడు ఆడపిల్లలతో ఆడుతూ పాడుతూ ఉన్నాడనుకుంటారు 6 సం॥ ల పిల్లవాడు వీరితో ఆడట మేమిటి ? తల్లి బిడ్డలు ఆడుకోవటంలేదా ? అక్కాచెల్లెళ్ళు, అన్నా తమ్ముళ్ళు ఆడుకోవటంలేదా ? ఈ విధమైన ఆటలు, మాటల చేతనే వారి హృదయాలను కరిగించి, మెదిలించి, కదిలింపజేసాడు. ఆనాడు కృష్ణుడు చేసిన మార్పులు ఏమిటి ? మనుషులను మార్చలేదు, మనసులను మార్చాడు ఈనాడు మనుషులు మారు తున్నారుగాని, మనసులు మాత్రం మారటం లేదు ఏం ప్రయోజనం ? గుడ్డలు మారితే గుణం మారనవసరం లేదా ? కనుక మనిషి మారనవసరంలేదు, మనసు మారాలి. మనిషి అంటే మనసే మనసంటే సంకల్పములే. కనుక మొట్టమొదట సంకల్పాలను పవిత్రమైన సంకల్పాలుగా అభివృద్ధి గావించుకోవాలి ఈనాటి సంకల్పములు స్వార్థ స్వప్రయోజనములతో నిండి నిమిడీకృతమై ఉంటున్నాయి.

కృష్ణుడు కనిపించని సమయంలో బృందావనంలో ప్రవేశించిన గోపికలు అన్నింటినీ కృష్ణరూపంగానే భావించేటటువంటివారు చెట్లలో, కొమ్మలలో, ఆకులలో పూలలో – అన్నింటిలో కృష్ణుని రూపం చూచుకొని సంతృప్తి చెందేవారు. అన్నీ భగవంతుడు సృష్టించినవే కాబట్టి చెట్లు వినగలవని, పుష్పములు మాట్లాడగలవని వారి విశ్వాసం. ఎందుకనగా ''సర్వతః పాణిపదం తత్సర్వతోక్షి శిరోముఖం'' అందువలననే ఈ పరితాపమును, వియోగమును భరించుకోలేక బృందావనంలో ప్రవేశించారు గోపికలు కృష్ణుని గురించి అడుగుతున్నారు పుష్పాలను. కృష్ణునికోసం పొదలలో వెదుకుతున్నారు. గోపికలకు మరో భావం లేదు, వారి మనసులలో మరో రూపంలేదు. ఒకే కృష్ణరూపమే, ఒకే కృష్ణ భావమే, ఒకే కృష్ణ దృష్టియే. వారిది ప్రేమ దృష్టియే కాని వైర దృష్టికాదు. గోపికలు ఏనాడు కృష్ణునితో వైరమునకు దిగలేదు. అప్పుడప్పుడు



కృష్ణునితో పోట్లాడి నప్పటికినీ, ప్రేమతో వచ్చినదే కాని అది వైరము కాదు. ఈ విధమైనటువంటి ప్రేమ తత్త్వాన్ని ప్రసరింపజేస్తూ వచ్చింది కృష్ణావతారము. ప్రేమ అనేటటువంటిది నిరంతరం ఉంటుండేటటు వంటిదే. ఇది మారేటటువంటిదికాదు, కదిలేటటువంటిది కాదు, కరిగేటటువంటిదికాదు. ఎప్పుడూ నిత్యసత్యమై నిర్మలంగా ఉండేటటువంటిది

ఈ నాటి మానవత్వం మట్టిపాత్రలో పోసినటువంటి అమృతమయమైనటువంటి జీవితం ఇది మట్టిపాత్ర. కాని దీనిలో పోసినటువంటిది అమృతమైనటువంటి ఆనందం. బంగారు పాత్రలో విషం పోసినప్పటికినీ ఆ పాత్ర నాశించే మూర్ఖులే ఎక్కువమంది ఉంటుంటారు. పాత్ర బంగారమే కాని, లోపల ఉన్నటువంటిది విషమే, ఇది మృణ్మయమైనటువంటి దేహం, ఈ మృణ్మయమైనటువంటి దేహంలో చిన్మయమైనటు వంటిది నిరంతరం ఉంటుండాలి. కనుక ఈ మానవ

దేహాన్ని మనం కోరాలి. మానవ దేహంతోనే మాధవత్వాన్ని మనం పొందాలి, కనుక మానవత్వమనేది తుచ్ఛమైన జీవితంగా మనం భావించరాదు. మానవ జీవితం జీవించదగినటువంటిది, ప్రేమించదగినటువంటిది, విలువైనటువంటిది, విశిష్టమైనటువంటిది, విశ్వసించదగినటువంటిది. అలాంటి మానవత్వాన్ని ఈనాడు మనం కేవలం మట్టిపాలు చేస్తున్నాం. మాణిక్యమువంటి మన జీవితాన్ని కేవలం మసిబొగ్గులకు అమ్ముకుంటున్నాం. కాదు .... కాదు .... మొట్టమొదట మనం మానవ జీవితాన్ని గుర్తించుకోవటానికి ప్రయత్నించాలి.

మన లక్ష్యమేమిటి? వచ్చిన స్థానానికి పోవాలి. మన కర్తవ్యమేమిటి? తిరిగి తిరిగి స్వస్థానానికి పోయి చేరాలి. వివిధ ప్రాంతాలనుంచి ఇక్కడకి ఎందరో వచ్చారు. కాని ఎంతకాలం ఇక్కడ ఉండగలరు? పరిమితమైన కాలం మాత్రమే ఉండగలరు. ఎప్పటికైనా ఎవరి స్వస్థానమునకు వాళ్ళు వెళ్ళక తప్పదు. ఆ దేరీతిగ ప్రాకృతమైన ఈ భూలోకమునకు యాత్రికులుగా వచ్చారు. తిరిగి మీ స్వస్థానమునకు చేరక తప్పదు. ఏమిటా స్వస్థానం? అనేకమంది భక్తులు 'మాకేదైన మార్గం చూపండి' అని ప్రార్థిస్తుంటారు. ఏమిటా మార్గం? వచ్చిన మార్గాన్నె పట్టుకొనిపో! ఎక్కడినుండి పుట్టావో! అక్కడికి నీవు వెళ్లు! కొత్త మార్గాలెందుకు? అదే మనం గుర్తించుకోవలసింది. ఆత్మనుంచి వచ్చావు. ఆత్మలో ప్రవేశించాలి. బ్రహ్మనుండి వచ్చావు, బ్రహ్మలో చేరాలి. బ్రహ్మ అంశంగా వచ్చావు, బ్రహ్మగానే మారాలి. అదే మనలక్ష్యం. ఈ మధ్యమార్గంలో అనేక ఒడుదుడుకులు వస్తుంటాయి. వాటిని మనం లెక్కచేయకూడదు. మన విశ్వాసం గాఢమైన విశ్వాసంగా ఉండాలి. అదియే నిజమైనటువంటి భక్తి''.

భక్తి అనగా కేవలం పూజలు చేయటం, భజనలు చేయటం మాత్రమే కాదు. ఇది సత్ కర్మలకు సంబంధించినటువంటిది, భక్తి అనగా నిర్మలమైన ప్రేమను పరమాత్మకు అర్పితం చేయటమే. ఎందుకనగా అక్కడనుంచి వచ్చే సమయంలో ఆ ప్రేమతోనే నీవు వచ్చావు. కనుక దానినే నీవు ఆధారంచేసుకొని పోవాలి. అది నీ తాత సొత్తు కాదు. ఆ ప్రేమ ప్రేమస్వరూపుని యొక్క సొత్తే. తన సొత్తును తాను తీసుకొని తాను నా సొత్తుగా భావించుకోవటమే - అదే మమత్వము. ఆ మమత్వము ఉండినంతవరకు కూడనూ ఆత్మతత్త్వం మనకు అర్థం కాదు. సమస్త విచారములకును, సమస్త దుఃఖములకును ఈ అభిమాన మమకారములే మూలకారణము. మమకార, అభిమానములు ఉండవలసినదే. ఎంతవరకు? కొంత పరిమితంలో ఉండాలి. నాకు దాహం వేస్తున్నది. నీరు కావాలి. ఒక టంబ్లర్ నీరు తీసుకుంటే దాహం తీరుతుంది. అటువంటప్పుడు గంగాజలమంతా కావాలని కోరుకోవటం ఎందుకు? అదే పేరాశ. ఈ ఆశలు మితిమీరిపోవటంచేతనే అశాంతి మనలో అభివృద్ధి అవుతున్నది. కాని గోపికలు, గోపాలురు తృప్తితో జీవిస్తూవచ్చారు. వారికి ఏ విధమైనటువంటి వాంఛలూ లేవు. వారి వాంఛ ఒక్కటే దైవం కావాలి. నేను ఎక్కడ నుంచి వచ్చానో అక్కడికి వెళ్ళాలి. ఎవరు నా ప్రాణమో, వారిని నేను చేరాలి. అదియే నా జీవిత గమ్యము. ఆ విధంగా వారు భావిస్తూ వచ్చారు.

ఒక్కొక్క సమయంలో మాయ కప్పుతూ ఉంటుంది. దాని నుండి తప్పించుకోవటంగాని, దానిని విడిపించుకోవటంగాని మహా కష్టం. ఒక పర్యాయం బ్రహ్మ కుంభవర్షమును కురిపించాడు. వ్రేపల్లె ప్రజలందరూ ఈ కుంభవృష్టికి తట్టుకోలేక కృష్ణుని ప్రార్థించారు. కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తాడు. ప్రజలందర్ని దాని క్రిందకు రమ్మనమన్నాడు. ఇంతలో వారిని మాయ ఆవరించింది. 'బాలుడీతడు, కొండ దొడ్డది, మహా భారంబు ఈతడు మోయంగజాలడు' అనే సందేహం వారిలో వచ్చింది. దీనిని మోయగలడో! లేదో! దీనిని తమ తలలపై వేస్తాడేమో నని భయపడి పరిగెత్తుకొని పోయారుట ఆ ప్రజలు. ఇలాంటి "డౌటింగ్ థామస్'' లు యుగయుగముల నుండి వస్తున్నారు.

ఇటువంటి సందేహాలకు అవకాశమే యివ్వరాదు ఒక్కసారి నమ్మితిమా ! చచ్చేంతవరకూ నమ్మాలి చావో బ్రతుకో రెంటిలో ఏదో ఒకటి తేలాలి. ఎప్పుడు చూచినా Bumps, Jumps, Bumps, Jumps - దీని వలన నీవే చెడిపోతావు తప్ప, పరులకు ఏమాత్రం నష్టంలేదు. మన శ్వాస ఎటువంటిదో, మన ప్రాణం ఉండినంతవరకు 'భగవత్ విశ్వాసం' అటుల ఉంటుండాలి. అదియే నిజమైన జీవితము.

ప్రేమస్వరూపులారా !

భగవంతుని జన్మోత్సవాలు చేసుకుంటుంటారు దీని రహస్యమేమిటి ? ప్రతి అవతారము "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" ధర్మమంటే ఏమిటి? "ధారయతీతి ధర్మః" అన్నారు. మనలను ధరించినటువంటిదే ధర్మము ఏమిటి అది మూడే 1. శరీరము 2 మనస్సు 3 వాక్కు. ఈ శరీరమునకు హస్త మన్నారు మనస్సుకు సంకల్పమన్నారు వాక్కుకు నాలుక అన్నారు కనుక ఈ మూడింటి యొక్క ఏకత్వమే మన ధర్మము ఆలోచనలు, మాటలు, చేతలు - ఈ మూడూ ఒక్కటి కావాలి. దీనికి ఏ దేశము యొక్క భేదముగాని, ఏ మతముల యొక్క భేదము గాని, ఏ ప్రాంతము యొక్క భేదము గాని ఏమాత్రమూ లేదు అన్ని దేశములవారు, అన్ని కాలములవారు దీనిని అనుసరించవలసిందే ఈ మూడింటినీ ఎవరు అనుసరిస్తారో, వారే ధన్యులు అట్టివారి వెంట దైవము నిరంతరం వెంట జంట ఇంట ఉండి కంటికి రెప్పవలె కాపాడుతుంటాడు ఆ ధర్మాన్ని మనం ఈనాడు సంరక్షించాలి అయితే ఈనాడు మనసులో మనం సంకల్పం చేసేది ఒకటి, మాట్లాడేది మరొకటి, క్రియ చేసేది ఇంకొకటి

ఈనాడు శరీరబంధాలు అధికమైపోతున్నాయి ఉపాధి భేదములు అధికమైపోతున్నాయి ఈ ఉపాధి భేదము చేతనే మనం స్వధర్మాన్ని విస్మరిస్తున్నాం. పరధర్మాన్ని భ్రమిస్తున్నాం. స్వ .... ధర్మం అంటే ఆత్మ ధర్మం, పర .... ధర్మం అంటే దేహధర్మం ఎంతకాలమైనా ఇంకా మనం దేహధర్మాన్నే అనుసరిస్తున్నాంగాని, ఆత్మధర్మాన్ని అనుసరించడంలేదు బంధములన్నింటికినీ శరీరమే మూలకారణం శరీరములు వేరు కాని ఆత్మ ఒక్కటే అలాంటి భావమును తెలుసుకోవటమే "స్వధర్మము" అన్నారు దేహ ధర్మాన్ని అనుసరించడమే "పరధర్మము". అన్నారు దేహభావము అమితంగా ఉండకూడదు దైవార్పితమైన భావంతో ఉండాలి. శరణాగతి భావం ఉండాలి నీవే నేను, నేనే నీవు నీవు నాలో ఉన్నావు, నేను నీలో ఉన్నాను. దేహములు వేరు, దైవము ఒక్కడే ఇలాంటితత్వాన్ని గుర్తించుకోవటానికి తగిన కృషి చేయాలి

ఈ తత్వం యశోదకు కూడా అర్థం కాలేదు. పదునాలుగు లోకాలు కృష్ణుని నోటిలో చూసింది అనేక మహత్యములు దినదినమూ చూస్తూనే ఉన్నది. అయినప్పటికినీ ఆ మాయ యశోదను వదలలేదు దీనికి దేహాభిమానమే మూలకారణము. "గోరంతలేవు బాలా! ఊరంతయు ఆగడంబు ఒకటే రద్దున్" అంటూ యశోద కృష్ణుని చెట్టుకు కట్టివేసిందట ఈ విధమైనటువంటివి అన్నీ కూడా భక్తులకు ఆదర్శవంతమైన దివ్యశక్తిని నిరూపించే నిమిత్తమై జరిగినవే కాని మరొకటి కాదు. మానవాతీతమైన శక్తి సర్వులయందూ ఉన్నది ప్రతి వ్యక్తి యందు దివ్యత్వముంటున్నది. ఎవరి శక్తి, ఎవరి విశ్వాసాన్ని బట్టి ఆ దివ్యత్వం ప్రకాశిస్తూ ఉంటుంది. ఇవన్నీ అమితంగా ప్రకాశించాలంటే, ప్రేమతత్వం ఒక్కటే ప్రధానమైన మార్గం కనుక "ప్రేమచేతనే పరమాత్మని వశంగావించుకోవాలి" ద్వేషంచేతగాని, అసూయచేతగాని, అహంకారంచేత గాని భగవంతుడు ఏమాత్రం చిక్కడు ప్రేమ స్వరూపుడిని ప్రేమించినప్పుడే ఆ తేజస్సు మనలోనికి వస్తుంది మనలో తేజస్సు అభివృద్ధికావాలి. ఆనందం అభివృద్ధికావాలి, దివ్యత్వం లీనంకావాలి ఇదియే

మానవుని యొక్క ప్రధానమైన కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని విస్మరించి, ఏదో కర్మలు చేస్తున్నాం. ఏమిటి ఈ కర్మలు ? పొట్టకూటికోసం చేసే కర్మలే. అదీ కావల్సిందే. కాని నిరంతరం పొట్ట .... పొట్ట .... అని ప్రాకులాడకూడదు బ్రతటానికోసం తినాల్సిందే తినటమే జీవితలక్ష్యం కారాదు కాని సత్యమును మాత్రం వదలరాదు. దేవుడనే శ్వాస దీనిలో ఉండినంతవరకే ఇది మంచి కళలతో, మంచి సుగంధాలతో, మంచి ఆరోగ్యంతో, ఆనందంతో కళకళలాడుతూ ఉంటుంది కిలకిల నవ్వుతూ ఉంటుంది. ఆ శ్వాస పోయినతక్షణమే దానిని ఎవరూ చూడలేరు. దుర్గంధం ప్రారంభమవుతుంది, తక్షణమే, తీసుకొనివెళ్ళుతారు ఈ దేహం ఇంతికాలం ఇంత స్వచ్ఛంగా ఉండటానికి కారణమేమిటి ? శ్వాస అనే స్వస్వరూపమే దీనికి మూలకారణము. అదియే దైవత్వము, అదియే దివ్యత్వము, అదియే ఆత్మతత్త్వము. ఆ చైతన్యం సర్వత్రా ఉంటున్నది. కనుక దుఃఖములకు, కష్టములకు, నష్టములకు మనం ఏమాత్రం కృంగరాదు ధైర్యంగా జీవితాన్ని ఎదుర్కోవాలి. ఎంత చదివినప్పటికినీ, ఎంత పెద్ద ఉద్యోగములు చేసినప్పటికినీ, ఎంత ధనమును ఆర్జించినప్పటికినీ, దైవవిశ్వాసమును మాత్రం మరువకూడదు అదియే ఎప్పటికైనామన గతి, మనస్థితి. మనమతి మన సంపత్తి అయితే మనం ఈనాడు మన గతిని, మన స్థితిని, మన మతిని, మన సంపత్తిని మరచిపోతున్నాం కాని ఒక్క స్వార్థమును మాత్రమే జ్ఞాపకం పెట్టుకుంటున్నాం ఇది స్వార్థమనేటువంటిది కాదు ఆత్మతత్త్వమే మన స్వార్థం, దేహతత్త్వము కాదు మన స్వార్థం ఈ విధమైన ఉపదేశాన్ని సర్వులకు అందించింది భగవద్గీత.

మనం ఏ పని చేసినప్పటికినీ భగవంతుని యొక్క పవిత్రమైనటువంటి పూర్ణతత్త్వాన్ని గుర్తించుకొని చేయాలి భగవంతుని తృప్తికోసం మనం సర్వకర్మలూ ఆచరించాలి. నిస్వార్థమైన రీతిలో మనం అనుభవించాలి.



కరెంటు కోతవలన మరియు ప్రత్యేకసంచిక ప్రయత్నంలో ఉండటంవలన ఈ అక్టోబర్ సంచిక కొద్ది పేజీలతో మాత్రమే వెలువడింది. అన్యథా భావించకండి. -సం॥

"అనిత్యం, అసుఖం లోకం" ఇదే భగవద్గీత సారం. భగవంతుణ్ణి ఎందుకు స్మరించాలి ? ఎందుకు ప్రేమించాలి? ఈ ప్రపంచం సత్యమైనది, నిత్యమైనది కాదు కనుకనే భగవంతుని ప్రేమించాలి అట్టి ప్రేమతత్త్వాన్ని మనం పొందటానికి ప్రయత్నించాలి

ప్రేమస్వరూపులారా !

"ఉత్తిష్ఠ ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత" ఇది భగవంతుడు చేసిన ఉపదేశం కనుక ప్రతివ్యక్తి సాధ్యమైనంతవరకు మంచి కార్యములలో ప్రవేశించి, అందరియందు దైవమున్నాడనే ఏకత్వాన్ని విశ్వసించి, అందరికీ ఉపకారం చేయండి ఎవరికి చేసినా నా స్వామికే చేస్తున్నామనే ఉత్తమమైన భావాన్ని పెంచుకోండి "సర్వకర్మ భగవత్ ప్రీత్యర్థం" అని భావించండి. ఆ విధంగా కర్మలు చేసినప్పుడే దైవం మీతో ఉంటుంటాడు దైవం నీలో ఉన్నాడు, నీవు దైవములో ఉంటున్నావు నీకూ దైవమునకు భిన్నం లేదు. ఏకత్వమే నిజమైనటువంటి మనస్తత్వం నీ మనస్సును మాత్రం ఏకం చేయాలి అది భగవత్ భావాన్ని ఏకం చేస్తుంది. అన్య భావములు దీనిని చేయలేవు కనుక భగవత్ నామస్మరణచేస్తూ, సమాజంలో సేవలు చేస్తూ, ఎవరికో సేవలు చేస్తున్నామని భావించక, నా దైవానికి నేను సేవచేస్తున్నాననే విశాలమైన భావాన్ని పెంచుకోండి

(కృష్ణాష్టమి సందర్భమున (ది 18-8-95) ప్రశాంతి నిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)

అర్థాలు - అంతరార్థాలు - 6

# ఏక వింశతి పత్రపూజ

— శ్రీ శివచిదానంద భారతీస్వామి

భారతదేశంలో హిందువులలో వినాయకచవితి పూజ చేయనివాడు ఉండరు వినాయక వ్రతకల్పములో 21 రకముల పత్రములతో పూజింపవలసియున్నది ఆ ఇరువది ఒక్క పత్రములతో పూజించకున్నచో ఆ వ్రతవిధి సక్రమముగా నిర్వహింపబడినట్లు పరిగణింపబడదు అందున, ఆ పూజ విశేషించి బాలబాలికలు నిర్వహించవలసియున్నది ఇప్పుడు వినాయకచవితి రోజున బజారులో అమ్ము పత్రములు భిన్నములై ఏక వింశతి పత్రములు అనగా 21 రకముల పత్రములలో చెప్పినవిగాని ఇతర పత్రములు ఎన్నియో జేరుచున్నవి ఆ పూజ వలన లక్ష్యసిద్ధి వమ్ము అగుటయే గాకుండ ప్రకృతి చేటు అగుచున్నది ఆ ఇరువది ఒక్క పత్రములు ఆయుర్వేద శాస్త్రములో ఒక్కొక్క వ్యాధి నివారణకు, ఒక్కొక్క పత్రము ఎంతయో వినియోగ పడును విద్యార్థి దశలోనే అట్టి పత్రముల యొక్క పరిచయము కల్గుటకు మాత్రమే చవితి పూజ ఏర్పాటు చేయబడినది. భాద్రపద మాసమగుటచే వృక్షములు ఆకులు బాగుగా ఎదుగును వాటిని సేకరించినప్పటికి వృక్షమునకు చేటు కలుగనేరదు. ప్రతి విద్యార్థి సమీప చిట్టడవులలోను, గ్రామ సమీప ప్రాంతములందును, ఇండ్ల పెరటి దొడ్లలోను పెరిగే చెట్లను గుర్తించి, వాటి ఆకులను సేకరించుట ప్రథమ పాఠారంభము అగుచున్నది. ప్రతి ఇంటి యందు ఆయుర్వేద మూలికా విశేషమును తెలుసుకుని, ప్రథమ చికిత్సాది అవసరములను తీర్చుకొనగలిగే స్థితిలో బాల్యమునందే తీర్చిదిద్ద గల ప్రథమ సోపానమే వినాయకచవితి పూజ. వేద ప్రతిపాదితమైన ఆయుర్వేదము సనాతనమైనది శాస్త్ర సమ్మతమైనది వినియోగించినచో (Side effects) విషపరిణామములు కలుగచేయనిది ఒక ఆయుర్వేద శాస్త్రమై యున్నది ఆ వ్రతములో గల నిగూఢార్థ లక్ష్యం విస్మరించి కొత్త బట్టలు, సినిమాలు వరకు మాత్రమే పరిమితమగుట దురదృష్టకరము. ○

# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

—శ్రీ ఆర్. కె. కరంజియా

( అనువాదము : డా॥ రాపర్ల జనార్దనరావు )

( గత సంచిక తరువాయి )

## మోక్షప్రాప్తికి మార్గం

కరంజియా : కోర్కెలులేని మానవులు దైవసమానులు ఎట్లగుదురు ?

బాబా : కోర్కెలులేని జీవితము అంటే పవిత్రమైన, సత్యమైన ఆత్మసాక్షాత్కారమే కోర్కెలచే బంధింపబడిన జీవి స్వార్థపరునిగ దిగజారుతాడు. అతని ఆత్మ అహంకారరూపం దాల్చుతుంది. ఆత్మదర్శనం చేసికొనుటకు మార్గం ఆత్మ అహంకారంనుండి బంధవిముక్తము కావాలి అప్పుడు నీ ఆత్మ ఆలోచనలకు అతీతమై నిజమైన దైవస్వరూపమై ఉంటుంది. అది సత్య స్వరూపము. మనస్సు అనేది నిజమైన ఆత్మ స్వరూపాన్ని కప్పిపుచ్చే వస్త్రం లాంటిది ఆ వస్త్రంలోని దారములే మానవుని కోర్కెలు ఆ వస్త్రమే ఆత్మసాక్షాత్కారానికి అడ్డు తగులుతుంది కోర్కెలను త్యజించితే, అవరోధం కలిగించే ఆ వస్త్రమూ, అందలి నూలుపోగులూ తొలగిపోతాయి అప్పుడే ఆత్మ యొక్క స్వస్వరూపం గోచరిస్తుంది ; ఇదే 'వేదాంతం' ఇది మానవుని తన అహంభావనలను తొలగించుకొనమని మనకు తెల్పుతుంది.

ప్రశ్న : అంటే దీని అర్థం మానవుని మనస్సే మానవునికి దైవానికి మధ్య అవరోధం అవుతుంది అనేనా ?

బాబా : అవును. మానవుడు అహంభావనను కలుగజేసే మనస్సునకూ, నిజ చైతన్యాన్ని కలుగజేసే అంతరాత్మకును మధ్యగల తేడాను అర్థం చేసికోవాలి ఈ పేర్కొనబడిన అంతరాత్మయే మానవుని స్వార్థ చింతన లనెడి బంధనములను అధిగమింపజేసి సత్యరూపమును సాక్షాత్కరింపచేస్తుంది సామాన్యముగ మనోవిజ్ఞానము బాహ్యవస్తువులను పరికించి, జ్ఞానేంద్రియముల తోడి అవగాహన చేసికొనుచు 'ఇదియేమి' అని ప్రశ్నించుకొనుచుండును.

కాని అంతరాత్మ యందలి చైతన్య జ్ఞానమును అన్వేషించు ముముక్షువు అంతర్ముఖుడగును. పంచేంద్రియములకు అతీతమైన జ్ఞానము ద్వారా అహంమనెడి భావమును పరిత్యజించినపుడే ఆత్మ సాక్షాత్కారము కలుగగలదు. అంతర్ముఖుడైన విజ్ఞుడు మాత్రమే మనసేంద్రియమునకు అతీతుడై 'అదిఏది?' అనెడి ప్రశ్న వేసికొనును

గనుక, వ్యక్తి మనోభావములను అధిగమించి, చైతన్యపూర్వకమగు ఆత్మజ్ఞానమును అన్వేషించవలయును అనంతము, విశ్వవ్యాప్తమునగు ఆత్మ రూపము నెరుగవలయునన్నచో, స్వల్పము, నియమితమగు, వ్యక్తి భావమనెడు చెఱసాల నుండి విముక్తుడు కావలయును. కోర్కెలన్నియు పంచేంద్రియములు, మనసు, మెదడు నుండి ఉద్భవించుచుండును వీని నుండి వ్యక్తి విడివడినచో, జీవాత్మ పరమాత్మ, చైతన్యము, సత్యజ్ఞానము మున్నగునవి తెలిసి, పరమాత్మతోడి అనుసంధానము కలిగియుండును. ఆత్మనెరుగుటయే పరమాత్మ నెరుగుట. ఈవిధముగ మాత్రమే మానవుడు దైవమును చేరగలడు.

( సశేషము )

# పాశ్చాత్య దేశాలలో సాయి విశేషాలు

- అనువాదము : ఎన్. బి. ఎస్. రామారావు

## 1. ఆస్ట్రేలియా :

(కాన్ సాయిలైట్ - సత్యసాయి సంస్థల జపాన్ పత్రిక - ఆగస్టు 1993)

అక్టోబరు 1991 సం॥లో సిడ్నీ - అవుటర్‌వెస్ట్‌లో నివశించు ఆస్ట్రేలియా బాలిక (12 సం॥ వయసు) తానొక ప్రత్యేక వేషధారి, కాషాయాంబరములతో, పెద్ద ఆఫ్రికన్ పద్ధతి జుట్టు గల వ్యక్తిని తన యింటికి వచ్చుట చూసితినని - తన తండ్రితో చెప్పినది ఆ బాలిక తల్లిదండ్రులు అనతికాలములో విడిపోయారు. తండ్రి ప్రక్క యింటిలో గల సాయిభక్తుడైన ఒక వ్యాపారస్తునితో అప్పుడప్పుడు మాట్లాడుతూ వుండేవాడు కానీ సాయిపై నమ్మకము లేకుండెను అయన సత్యసాయి బాబాను గురించిన కొన్ని వీడియో ఫిల్ములు కూడా చూపెను తన భార్య విడిపోయినందువలన, తన కూతురు తాలూకు కష్టములను తీర్చలేక కూతురును సాయిబాబాను శరణువేడమని సలహా నొసంగెను కానీ అతనికి మాత్రము సాయిపై ఎట్టి నమ్మకము లేకుండెను.

కూతురు ప్రార్థనపై ఆ ప్రత్యేక వేషధారి, బుట్టతల జుట్టు, కాషాయాంగర్కాలతో కనపడి, అభయ హస్తముతో, ఆమె సమస్యలు కష్టములు అన్నియు త్వరలో తొలగిపోవునని ఆమెను ఓదార్చెను. ఈ విషయము కూతురు తండ్రితో చెప్పగా తండ్రి ఆశ్చర్యపడి, ప్రక్క ఇంటి వ్యాపారపు స్నేహితునడిగి ఒక సాయి బాబా ఫొటోను తీసికొనివచ్చి తన కూతురైన 12 ఏండ్ల బాలికకు చూపించి, మన ఇంటికి వచ్చి నీతో మాట్లాడిన వ్యక్తికి ఈ ఫొటోలోని పోలికలు కలవా ? అని ప్రశ్నించగా - ఏమీ అనుమానము లేదు. మన ఇంటికి వచ్చినది ఈయనయే - ఈ సాయిబాబాయే అని ఆమె సమాధానమొసంగెను ఇది - 'ఏన్ అబ్రిహోప్స్' అను ఆస్ట్రేలియా బాలిక అనుభవము - సిడ్నీ.

## 2. 'కోబ్' సాయి సెంటర్ - జపాన్

3 rd మే 993వ జపాన్ దేశములో కోబ్ (Kobe) పట్టణములో 400 మంది సాయి భక్తులు Kenmin Hall లో 'ఈశ్వరాంబ డే' జరుపుకొనిరి. ఈ ఉత్సవము జరిగినంత సేపూ సుమారు 4 గంటల సేపు 'సాయిబాబా వారు' అచట తమ ఉనికిని తెలియపరచిరి కార్యక్రమము ప్రారంభించినపుడు 'జ్యోతి' గా వెలిగించబడిన 8 కొవ్వొత్తి కార్యక్రమము పూర్తి అగు వరకూ ఎక్కువ కాంతితో - ప్రత్యేక కాంతితో - 4 గంటల సేపు నిలిచి వెలిగినది స్వామి కొఱకు స్టేజీపైన ఒక కుర్చీని వేసి ఆ కుర్చీ చేతిపై తెల్లని జేబురుమాలు వేసిరి ఆ జేబురుమాలు ఈ చేతి నుండి ఆ చేతికి, అటునుండి ఇటు, కార్యక్రమము జరిగిన 4 గంటల లోనూ అనేకసార్లు ఇటు - అటు తనంత తాను మారినది. (అనగా మన కండ్లకు కనిపించకపోయిన స్వామి ఆ కుర్చీలో సూక్ష్మశరీరముతో కూర్చొని, కార్యక్రమము తిలకించుచూ - ఆ చేతి రుమాలును ఉపయోగించి అటు నిటు మార్చిరని మాట). దీనిని అందరూ ఆశ్చర్యముతో తిలకించిరి స్వామి సర్వవ్యాపకత్వము అటువంటిది.

(సాయి కాన్‌లైటు - జూన్ 1993 పత్రిక)

### టోక్యో

మే 6, 1993 న టోక్యో నగరములో జరిగిన "ఈశ్వరమ్మడే" ఉత్సవములకు 5000 మంది హాజరైరి.

## 112 ప్రపంచ దేశములలో సాయిబాబావారి 70వ జన్మదినోత్సవ వేడుకలు (కాన్సొలేట్ ప్రకటన)

భగవాన్ సత్యసాయిబాబావారి 70 వ జన్మదిన సందర్భంగా 6 వ ప్రపంచ (సత్యసాయి సంస్థల) మహా సభల సందర్భంగా ఈ క్రింది కార్యక్రమములు 112 పాశ్చాత్య దేశములలో ఎట్లు జరుపబడవలసినదీ - నిశ్చయింపబడినది,

**A 1993 - ఆధ్యాత్మిక సంవత్సరముగా పాటించుట (Year of Spirituality**

1) భజనలను బలపరచి, కుటుంబసాధన, సామాజిక సాధన, దేశసాధన భజనల ద్వారా ఆధ్యాత్మిక అభివృద్ధికి తోడ్పడుట.
2) ప్రపంచ సమస్యలకు - పరిష్కారమార్గము - నిత్య జీవన విధానములో ప్రతి వ్యక్తి ఆధ్యాత్మిక మార్గమును అవలంబించుట
3) అందరి మానవులలోనూ భగవంతుని చూచుట ద్వారా తోటి మానవుల అభివృద్ధికి తోడ్పడుట.

**B 1994 - విద్యాభివృద్ధి సంవత్సరముగా పాటించుట (Year of Education)**

బాలవికాస్ కార్యక్రమములను అభివృద్ధిపరచుట

2) మానవతా విలువల కార్యక్రమములను అభివృద్ధిపరచుట
3) ప్రదర్శనలు - విద్యాభివృద్ధికి తోడ్పడు కార్యక్రమములు - సమావేశములు, చర్చలు, వర్క్‌షాపులు, క్రొత్త వారికి విద్యాబోధన, చలనచిత్ర ప్రదర్శన మొ॥ అభివృద్ధి పరచుట.

**C 1995 - మానవసేవా సంవత్సరముగా పాటించుట (Year of Service)**

1) రోగనిరోధక మందుల వాడకములో - సేవా కార్యక్రమముల నభివృద్ధి చేయుట
2) ఆయుర్వేద, హోమియోపతీ వైద్యవిధాన సేవల నభివృద్ధి పరచుట
3) వయోవృద్ధులకు - అనారోగ్యపు వ్యక్తులకు సేవల నధికంగా అందించుట
4) జైలులోని ఖైదీలు మొ॥ వారికి సేవలనందించుట
5) ఆధునిక పద్ధతుల వలన జనసమ్మర్ద ప్రదేశములలో వచ్చు అనర్థములను - తీసికొనవలసిన జాగ్రత్తలను తెలియపరచుట
6) సత్యసాయి వైద్యశాలలో సేవ చేయుట.

## విదురనీతి

శ్రుతం ప్రజ్ఞానుగం యస్య
ప్రజ్ఞా చైవ శ్రుతానుగా
అసంభిన్నార్య మర్యాదః
పండితాఖ్యాం లభేత సః"

ఎవరి విద్య బుద్ధిననుసరించి నడచునో, ఎవని బుద్ధి విద్యననుసరించి నడచునో, ఎవడు పెద్ద మర్యాదకు భంగము గావింపడో - అతడే పండితుడను పేరును పొందగలడు

○

---

నా చెంతకు భక్తిని తెచ్చి శక్తిని తీసుకుని వెళ్ళండి. మీరెంత ఎక్కువ తెచ్చిన, నాకంత హాయి. మీ దుఃఖములు కలతలు ఆతృతలు వీటిని నా వద్ద వదలి ఆనందము శాంతి సహనములను తీసుకుని వెళ్ళండి. నాకు కావలసినది స్వచ్ఛమైన హృదయ కమలములు; మంచి పనులు అను ఫలములు. రిక్త హస్తములతో నా చెంతకు వచ్చిన, ఆ హస్తములను బహుమతులతో నింపెదను. మీ చేతులు నిండుగా ఉన్న, నేనా చేతులలో నింపగల్గినదేమియు ఉండదు. - బాబా

---

# దీపావళి

జీవితంలో ఎన్నో దీపావళులు వచ్చి పోతున్నాయి. కాని మనలోని అంధకారం మాత్రం పోవటంలేదు. బయట వెలుగును చూచి ఆనందిస్తున్నాముగాని, లోన చీకటిని చూచి విచారించటంలేదు అందుకే గోపికలు "మబ్బు గమ్మిననాడు మానసమ్మున నీదు తేజము నిలుపరాదా" మా మానసిక హృదయవీధి చాలా చీకటిగా ఉంది. అందుచే నీ నామమనే జ్యోతితో వెలుతురు ఇయ్యి అని ప్రార్థించారు ఈ దీపావళికి ఇంకో అంతరార్థం. మనం అనేక జ్యోతులు పెట్టుచుము కాని, అన్ని జ్యోతుల దగ్గరకుపోయి నిప్పు ముట్టించము. మొదట ఒక్క జ్యోతిని వెలిగించి, దానితో అన్ని జ్యోతులను వెలిగించెదము. అంటించబడిన అన్ని జ్యోతులు జీవనజ్యోతులు. అంటించిన ఒక్క జ్యోతి పరంజ్యోతి పరంజ్యోతి అను వెలుతురులో అన్ని జ్యోతులు వెలుగుచున్నవి అయితే ఆ అంటించిన పరంజ్యోతిని, ఆ ఆదిజ్యోతిని మనం మరచిపోతున్నాం అందుచే అందరూ నరకాసురులే ఏనాడు మనం ఆదిజ్యోతిని లక్ష్యంలో ఉంచుకొందమో, ఆనాడు ఆ కృష్ణుని అనుగ్రహమునకు పాత్రులమగుదుము అందుచే ఏనాడు మనలోని అజ్ఞాన అంధకారమును పారద్రోలుదుమో— "తమసోమా జ్యోతిర్గమయ" ఆనాడే దీపావళి.

— బాబా

# మాయమైన శవం

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

ఆ మహానుభావుడు విజయదశమి నాటి రాత్రి తన దేహాన్ని పరిత్యజించాడు. దహనము చేయడానికి హిందువులు ఆ మృత శరీరాన్ని స్మశానానికి తీసుకు వెళ్ళారు. అతను మా మతమే బోధించాడు కనుక అతడు మావాడు. అతని శరీరాన్ని పాతిపెట్టాలి శవాన్ని మాకు ఇవ్వాలని మహమ్మదీయులు అడిగారు. ఇరు తెగలవారు వాదించుకుంటూ చివరకు కొట్లాటలకు సిద్ధమయ్యారు. ఆ సమయంలో ఒక వ్యక్తి వారి మధ్యకు వచ్చి "ఆ మహానుభావుడు తన శరీరాన్ని మీకోసం వుంచిపోతాడా?" అన్నాడు ఆ మాటలకు ఇరుపక్షాలవారూ శవమును వుంచిన చోటుకువెళ్ళి చూడగా శవము మాయమైంది. అందరూ ఆశ్చర్యపోయారు. ఆ మహాత్ముని దుప్పటి వారికి దొరికింది హిందువులు మహమ్మదీయులు ఆ దుప్పటిని రెండు ముక్కలుగా చేశారు. హిందువులు తాము తీసుకున్న ముక్కను దహనము చేశారు. తురకలు ఆ ముక్కను నేలలో పాతిపెట్టారు.

ఈవిధముగా హిందూ ముస్లింల మధ్య ఆ సమయంలో మహిమను ప్రదర్శించిన ఆ మహాత్ముడు గురునానక్ నానక్ స్థాపించిన మతము సిక్కు మతము నానక్ 1526 వ సంవత్సరము ఆశ్వయుజ శుద్ధ దశమి నాటి రాత్రి స్వర్గలోక ప్రాప్తి పొందినట్లు మనకు తెలుస్తోంది. కావలసింది శవం కాదు శాంతి, ప్రేమ, సత్యం, ధర్మం అనే వారి ప్రబోధాల ఆచరణ.